త్వరపడండి !

చందాదారులకు ఉచితం !

# శ్రీ సత్యసాయి శతకము

## ( ప్రథమ భాగము )

భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారి 68 వ జన్మదినోత్సవ సందర్భమున వెలువడు "శ్రీవాణి ప్రత్యేక సంచిక" ( నవంబర్ 93 ) తో పాటు 'శ్రీ సత్యసాయి శతకము' (ప్రథమ భాగం) శ్రీవాణి చందాదారులకు ఉచితంగా పంపబడుతుంది విడిగా అమ్మబడవు శ్రీవాణి చందాదారులకు మాత్రమే ఈ సదవకాశము కల్పిస్తున్నాం

క్రొత్త చందాదారులుగా చేరి ఈ సదవకాశమును వినియోగించుకో ప్రార్థన రెన్యూవల్ చేయవలసినవారు కూడా వెంటనే తమ తమ చందాలను పంపి 'శ్రీ సత్యసాయి శతకము' ను స్వంతం చేసుకోండి

ఈ శతకములో భగవాన్ సాయి అప్పుడప్పుడు ప్రవచించిన పద్యాలు, వాటికి వ్యాఖ్యతో పాటు సందర్భోచితంగా వివరణ యివ్వబడింది ముఖ్యంగా సాయి భక్తులకు ఎంతో ఉపయుక్తంగా ఉంటుంది భక్తులు కానివారు కూడా తప్పనిసరిగా చదువవలసిన అమూల్యమైన పుస్తకము

ది 25-10-1993 లోపు క్రొత్త చందాలు పంపినవారు, చందాలు రెన్యూవల్ చేసిన వారికే మాత్రమే ఈ శతకము పంపబడుతుంది.

| | |
|---|---|
| సం చందా . రు 48-00 | 4 సం చందా రు 175-00 |
| జీవిత సభ్యత్వం . రు 600-00 | పోషకులు : రు 1116.00 |

జీవిత సభ్యుల ఫొటోలు, పోషకుల ఫొటోలు శ్రీవాణిలో ముద్రించబడుతాయి. పోషకులకు మేము ప్రచురిస్తున్న ఇతర పుస్తకములుకూడా ఉచితంగా పంపబడుతాయి.

మనవి : పాత చందాదారులు ఒక్కొక్కరు కనీసం మరొక మిత్రునిచేత ఒక క్రొత్త చందాను చేర్పించి శ్రీవాణిని ప్రోత్సహించు ప్రార్థన.

గమనిక చెక్కులు అంగీకరించబడవు M O లేక D D ద్వారా చందాలు పంపవచ్చును D D అయితే Sree Vani పేర తీయించి పంపగలరు

చిరునామా Manager 'SREE VANI' Monthly
24-52, Ramanaidupet, MACHILIPATNAM - 521 001

# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు: కొమరగిరి కృష్ణమోహనరావు

అక్టోబరు 1993

సంపుటి . 9

సంచిక 10



మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-52, రామానాయుడు పేట

మచిలీపట్నం-521 001

ఫోన్ . 2818


| | | |
|---|---|---|
| విడి ప్రతి | రు. | 4-00 |
| సంవత్సర చందా | రు. | 48-00 |
| 4 సం॥ల చందా | రు. | 175-00 |
| జీవిత సభ్యత్వం | . రు | 600-00 |
| పోషకులు | . రు. | 1,116/- |

Cheques Drafts should be drawn in favour of SREE VANI, Monthly Machilipatnam


EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at

SREE VANI PRINTERS

MACHILIPATNAM


## విషయ సూచిక



ముఖచిత్రం శ్రీ వేంకటేశ్వరస్వామి

# దేవో దుర్బల ఘాతకః

కొమరగిరి

" అశ్వం నైవ గజం నైవ
వ్యాఘ్రం నైవచ నైవ చ
అజాపుత్రం బలిం దద్యాత్
దేవో దుర్బల ఘాతకః "

అనగా గుఱ్ఱమునుగాని,ఏనుగునుగాని బలి యీయరు పెద్దపులిని అంతకంటెను యీయరు మేక పిల్లను మాత్రమే బలి యిత్తురు దేవుడు కూడా బలహీనులనే భక్షిస్తాడు అని అర్థం దేవుడు కూడా బలవంతుల జోలికి పోడు బలహీనులనే నాశనం చేస్తాడు ఇది అనాదిగా వస్తున్న సంప్రదాయం బలహీనుడి వలననే శాంతికి భంగం వాటిల్లుతుంది, ఈ శ్లోకం ఎంతో వాస్తవికతను చాటుచున్నది గుఱ్ఱం పౌరుషం గల బలమైన జంతువు దీనిని బలిగా యివ్వటానికి తీసుకువెళ్లితే పెద్దగ సకిలించి, గంతులు వేసి ఎగిరి తన్నుతుంది ఆ తన్నుకు ప్రక్కన వున్నవాడి పళ్లు వూడి క్రిందపడుతాయి కనుక మానవమాత్రులు ఆ పనికి సాహసించరు బలంగల జంతువుని చూస్తే భగవంతునికి కూడా భయమేమో !

అదే విధముగా ఏనుగు జంతువులలోకెల్లా భారీ శరీరము కలది, బలం కలది తన తొండముతో పెద్ద పెద్ద మ్రానులను సహితం నేలకూల్చగలదు దానిని బంధించి బలిగా ఇవ్వడం అసాధ్యమైన పని అంత బలం గల భారీజంతువును బలిగా తిసుకోవటానికి భగవంతుడు కూడా వెనకాడుతాడేమో !

ఇకపోతే పెద్దపులి విషయం వేరేచెప్పనవసరంలేదు అది అతి క్రూరమైన భయంకరమైన జంతువు మనుష్యులను, జంతువులను అతి తేలికగా తన పంజాతో కొట్టి, చంపి నెత్తురుత్రాగి మాంసం తింటుంది దానిని ఎదురుగా పోవటానికి ఎవరూ సాహసించరు, కనుక అటువంటి భయంకరమైన జంతువును బలిగా యివ్వటం అసాధ్యమైన విషయం భగవంతుడు కూడా అట్టి క్రూర జంతువును బలిగా తీసుకోవటానికి భయపడుతాడేమో !

ఇకపోతే జాతరలలో మేక పిల్లలను భగవంతునికి బలిగా యివ్వటం అనాదిగా వస్తున్న ఆచారం కారణం? మేకపిల్ల సాధుజంతువు ఎవరినీ ఏమీ అనలేదు తిరుగబడదు, ఎదురు తిరగదు సహజంగా వాడుకలో 'మేకలాంటి మేధకుడు' అని అంటుంటారు అంటే సాధువులాంటి మనిషి అని అర్థం ఎవరినీ ఏమీ అనడని ఎవరి జోలికి పోడని, ఎవరికీ హాని తలపెట్టడని, అర్థం పరమ సాత్వికుడన్నమాట

ఇక్కడ మనం ఒక విషయం గమనించాలి బలహీనుణ్ణి ఎవరూ గౌరవించరు అతని మాటను ఎవరూ లెక్కచేయరు బలహీనత, పిరికితనం, అధైర్యం మొదలగు లక్షణాలు గల వ్యక్తి రాణించడు, శోభించడు బలహీనత ప్రగతికి అవరోధం, శాంతికి భంగం కనుక జీవిత సమరంలో నెగ్గాలంటే శక్తిని సముపార్జించాలి శక్తివంతుణ్ణే సమాజం గౌరవిస్తుంది, పూజిస్తుంది ఎంతటి మహత్కార్యాలనైనా శక్తివంతుడు సాధించగలుగుతాడు పదిమందిచేత మెప్పును పొందగల్గుతాడు విజయలక్ష్మి కూడా బలవంతుణ్ణే వరిస్తుంది బలహీనతకు మించిన పాపం వేరొకటి లేదని స్వామీ వివేకానంద ఏనాడో చెప్పారు " Stand and die on your own strength If there is any sin in the world, It is weakness, Avoid all weakness Weakness is sin, weakness is death

"బ్రతికినా చచ్చినా నీ బలముపైననే ఆధారపడి వుండుము ప్రపంచంలో దుర్బలత్వమే మహాపాపం, దుర్బలత్వమే మరణం కావున దానినెట్లయినను పోగొట్టుకొనుము" అని హెచ్చరించాడు ఇది సర్వులకు, సర్వ కాలములకూ వర్తిస్తుంది బలహీనుడి మీదికి బలవంతుడు వంటికాలిమీద లేస్తాడు పెద్ద చేప చిన్న చేపను మ్రింగుతుంది బలహీన దేశమును, బలవంతమైన (శక్తివంతమైన) దేశం కబళించడానికి ప్రయత్నిస్తుంది ఈ వాస్తవమును గ్రహించి గుర్తించి ప్రతి ఒక్కరూ శక్తిసంపన్నులు కావాలి అయితే అట్టి శక్తిని దుర్వినియోగం చేయరాదు మంచిని పెంచడానికి, పోషించడానికి మాత్రమే వినియోగించవలెను మన శక్తిని చూచి దుష్టులు భయపడాలి, శిష్టులు సంతోషించాలి

పై శ్లోకం మనకొక నీతిని బోధిస్తున్నది బలంగల గుర్రం, ఏనుగు, పెద్దపులుల జోలికి భగవంతుడు కూడా స్పృశానికి సాహసించడని, బలహీనమైన మేక లాంటి సాధుజంతువులను మాత్రమే భగవంతుడు సహితం వ్యాజాదత్రివ్యంగా (బలిగా) స్వీకరించువాడని పై శ్లోకం చెబుతున్నది "దేవో దుర్బల ఘాతకః" భగవంతుడు కూడా బలహీనులను మాత్రమే సంహరించటానికి సిద్ధపడుతాడు అంతే భగవంతునికి బలవంతుల మీదకు పోవటం చేతకాక బలహీనులను సంహరించుతున్నాడని భావించడం మాత్రం పొరపాటు భగవంతుని దృష్టిలో కూడా బలహీనత మహాపాపం కనుక బలహీనులుగా వుండవద్దని హెచ్చరించు నిమిత్తమై పై శ్లోకమును మన పెద్దలు చెప్పారు కనుక ప్రతి ఒక్కరూ బలమును సంపాదించాలి శక్తిని సముపార్జించాలి సర్వశక్తివంతుణ్ణి మాత్రమే సమాజం గౌరవిస్తుంది అట్టివారికే భగవదనుగ్రహం లభిస్తుంది అట్టి శక్తిని దుష్ట శిక్షణకు, శిష్ట రక్షణకు మాత్రమే ఉపయోగించాలి అసత్య ప్రచారాలను ధైర్యంగా ఎదుర్కొనాలి సత్యమును స్పష్టంగా, నిర్భయంగా చెప్పగలగాలి అట్టి ఆత్మశక్తిని ప్రతి ఒక్కరూ సంపాదించాలి అప్పుడే సమాజంలో శాంతి సుహృద్భావ వాతావరణం ఏర్పడుతుంది ○

## శ్రీవాణి జీవిత సభ్యులు



S సహరి
నర్సాపూర్
మెదక్ జిల్లా



Dr. M. Panduiangavithal
Prof Finance & Customs
I I M C, JOKA, ALIPUR (P O)
CALCUTTA-700 027 W B



ఇంకొల్లు శేషగిరిరావు
J T O (Telecom)
నారాయణఖేడ్

# అమృతవాణి

మాచిభట్ల చంద్రశేఖరశర్మ

శ్లో॥ చేపస్యంః సంతి? కువాసనాఖ్యాః
కః శోభతే య సదసిప్రవిష్టః
మాతేవకా?యాసుఖదా సువిద్యా
కిమేధతేదానవశాత్? సువిద్యా

ఇతరుల ధనాదులను అపహరించేవాళ్ళు దొంగలను కుంటాం అలాగే ఊళ్ళమీదపడి ఒక గుంపుగా వచ్చి దోచుకొనె వాళ్ళను దోపిడీ దొంగలనీ అంటాం నిజానికి వీళ్ళంతా పైకి కనబడే వస్తువుల్ని, ధన ధాన్యాదుల్ని మాత్రమే దోచుకుంటారు వాళ్ళకు కావలసింది కూడా అవే కాదని అడ్డగిస్తే ప్రాణాలు తీయటానికి తెగిస్తారు కాని వీళ్ళకంటే ప్రమాదం కలిగించే దోపిడీ దొంగలున్నారు వాళ్ళకు కావలసింది వస్తువులుకాదు,ధనాదులూకాదు, మంచిగావున్న మనిషిని చెడగొట్టటమే వాళ్ళ లక్ష్యం అలాంటి దస్యులు ఎవరో కాదు మనిషిలో వున్న దుర్వాసనలు అంటే చెడ్డకంపు అని కాదు

చెడ్డకంపులాంటి దుర్గుణాలన్న మాట అవిపుట్టుక లోనే సంక్రమిస్తాయి జీవికి పరిసరాల వల్ల దోహదపడి విజృంభిస్తాయి బుద్ధిమంతులయితే సదాచారం వల్ల సనాతన ధర్మాచరణవల్ల ఆ దుర్వాసనల దోపిడీ దొంగల్ని తన మీదకు రాకుండా చేసుకుంటారు లేకపోతే సద్గురువు నాశ్రయించి ఆయన ఉపదేశంతో ఆ దస్యుల ప్రభావం తమ మీద లేకుండా చేసుకోగలుగుతారు కనుక దుర్వాసనలే దస్యులు అలాగే చదువుకొన్న వాళ్ళెంతమంది లేరు ఈ లోకంలో చాలా మంది వున్నారు వాళ్ళందరూ ఇతరుల కుపయోగిస్తారనుకోటం భ్రమ పండితులందరూ ఇతరలకుపదేశమీయలేరు ఎంత చదువుకున్నా నలుగురికో నాలుగు మంచిమాటలు చెప్పటానికి సమయస్ఫూర్తి ఉండాలి లోపల ఏదో చెప్పాలనే తపన బాగా వుంటుంది **బయటికి మాత్రం ఒక మాటారివ్వగా** రాదు అలాంటివారు పదిమంది సభలో ఏంమాట్లాడుతారు? ఏ చదువైనా సభలో రాణించాలి అప్పుడే ఆయనని పండితుడంటాం బ్యాంకునిండా ధనం వుంది ఏంలాభం? సమయానికి వుపయోగించనప్పుడు ? అట్లే విద్యకూడా కనుక సభలో శోభించగల లేక రాణించగల పండితుడే విద్యావంతుడంటే విద్య అంటే జ్ఞానాన్ని కలిగించేది కావాలిగాని అది మినహా ఏమి వున్నా అది విద్యకాదు సద్విద్య మనిషికి కావలసిన తెల్సికోవలసిన సుజ్ఞానాన్ని ప్రసాదిస్తుంది ఆ విద్య మనిషికి నిజమైన శాశ్వత సుఖాన్ని కలిగిస్తుంది తుచ్ఛములయిన లౌకిక సుఖాలు కావు ఆత్మానందరూపమైన శాశ్వత సుఖాన్నియిస్తుంది సద్విద్య ఆ సువిద్య మనిషికి తల్లి లాంటిది తల్లి యెప్పుడూ తనపిల్లల సుఖాన్నే కోరుకుంటుంది అందుకే ప్రయత్నిస్తుంది సువిద్య అలాంటిది పొట్టకూటికి వుపయోగించినంత మాత్రాన అవన్నీ సువిద్యలని భ్రాంతిపడకూడదు ఆత్మజ్ఞానాన్ని అందించేదే సువిద్య

దానధర్మాలు చేస్తే ఏ వస్తువైన, ధనధాన్యాదులయినా తగ్గిపోతాయి ఆలా దానాలు చేసి దరిద్రులయిన వారెంతమంది లేరు అలాంటి దానం చివరికి మేలే కలిగిస్తుందనుకోండి కాని దానం వల్ల వస్తువు తగ్గిపోవటం నిజం కాని విద్యను దానం చేస్తే అంటే పదిమందికి ఉపదేశిస్తే ఆ విద్య తగ్గిపోవడం కాకపోగా పైపెచ్చు అద్భుతంగా అభివృద్ధి చెందుతుంది ఇది సువిద్యకుండే ఒక విశిష్టగుణం కనుక దొంగలంటే మనలోని దుర్వాసనలనీ, పండితుడంటే సభలో రాణించగలవాడనీ, సద్విద్య తల్లి లాంటిదని, దానం వల్ల పెరిగేది ఒక్క సద్విద్యే అని తెలిసింది ○

# శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్యము

మల్లాప్రగడ శ్రీరంగారావు

"శ్రియః కాంతాయ కల్యాణనిధయే నిధయేర్థినాం
శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్"

మన భరతఖండమున భగవంతుని అవతారాలు అనేకం వున్నాయి. అందరకు సామాన్యంగా తెలిసిన మత్స్య, కూర్మ వరాహాది పది అవతారాలనే గాక ఇంకా పదకొండు అవతారాలను భాగవతంలో వ్యాసమహర్షి వివరించారు. హయగ్రీవుడు, దత్తాత్రేయుడు, సనకాదులు మొదలగువారు అవతారమూర్తులే.

ఈ కలియుగంలో ప్రత్యక్షదైవంగా కోట్లకొలది భక్తులచే ఆరాధింపబడే దేవతామూర్తులలో శేషాచల నివాసియైన శ్రీవేంకటేశ్వరస్వామి మొదటగా స్మరింప తగిన దైవం. వేం = పాపాలను, కటతి = నాశనము చేయువాడు అనే అర్థంలో సమస్త పాపాలను పరిహరించే పరమ దయామూర్తి యీ స్వామి అని అనేకమంది భక్తుల విశ్వాసం.

అవతరణమంటే దిగిరావడమని అర్థం. భక్తులను అనుగ్రహించటానికి, దుష్టులను శిక్షించడానికి ఆర్తులను ఆదుకోడానికి ఆ వైకుంఠము నుండి యీ భూలోకానికి దిగివచ్చిన రూపమే శ్రీ వేంకటేశ్వరుడు.

" Avatara is to descend from heaven to earth" అని వివేకానందుని వాక్కు. దేశానికి ప్రమాదం సంభవించినపుడు పైనున్న జండాను క్రిందకు దింపడం మనకు తెలుసు. లోకాలకు దుష్టుల బాధ భక్తుల ఆర్తి అధికమైనపుడు భగవంతుడే దిగి వచ్చి ఆర్తులను ఆదుకొని దుష్టులను శిక్షించి లోకశాంతిని కలిగింపచేస్తూ వుంటాడు.

ఇటువంటి దేవతామూర్తులలో నేడు దేశ విదేశాల లోని అన్ని మతాల వారిచేత అత్యంత భక్తి విశ్వాసములతో ఆరాధింపబడుతూ తిరుమల క్షేత్రములో వెలసిన శ్రీనివాసుని కల్యాణమహోత్సవాలు బ్రహ్మోత్సవాలన్న పేరుతో ప్రతి సంవత్సరం ఆశ్వయుజమాసంలో మహా వైభవంగా కన్నుల పండువుగా జరుగుతూ వుంటాయి. శ్రీ దేవీ నవరాత్రి ఉత్సవాలలో జరుగుచున్న యీ మహోత్సవాలను నవరాత్రి ఉత్సవాలని కూడ వ్యవహరిస్తూవుంటారు.

వ్యాసమహర్షిచే రచింపబడిన అష్టాదశపురాణముల లోని వరాహపురాణ, స్కాందపురాణములందు సప్తగిరీశుడైన వేంకటేశ్వరుని మహిమా విశేషములు, ఉత్సవ వైభవములు వివరింపబడినవి. బ్రహ్మదేవుని ప్రార్థనపై కలియుగ మానవులను ఉద్ధరించుటకు కలి కాలుష్య నివారణకు, భక్తులకు మోక్షమార్గమును చూపించుటకు శ్రీమహావిష్ణువు ఏడుకొండలపై వెలసినట్లు చెప్పబడినది. సృష్టికర్తయైన బ్రహ్మ కోరికపై ఇలలో అవతరించిన యీ స్వామికి సంవత్సరిమున కొక్క పర్యాయం స్వయముగా బ్రహ్మయే చేయు ఉత్సవము గనుక దీనికి బ్రహ్మోత్సవమని పేరు వచ్చినట్లు వరాహపురాణమందున్నది. ఈ ఉత్సవములలో ఒక్కొక్కరోజున ఒక్కొక్క వాహనముపై స్వామిని అధిష్ఠింపజేసి బ్రహ్మేంద్రాది దేవతావర్గము పూజించి సేవించి భక్తజనులను తరింపచేయుటకై సర్వాలంకార శోభితులైన పద్మావతీ శ్రీనివాసమూర్తులను ఆలయ ప్రాకారము వెలుపల ఊరేగింపచేయుదురు. ఈ ఆచారము నేటికిని జరుగుచున్నది.

సమస్త పాపములను పరిహరింపచేయు కొండయే వేంకటాచలము. ఈ పర్వతం మేరు పర్వతమువలన

ఆవిర్భవించింది ఒక పర్యాయము శేషుడు వాయువు పరస్పరము తామే గొప్పవారమని వాదన చేసికొనిరి ఎవరు బలవంతులో నిర్ణయించుకొనుటకు ఒక పందెము (ఒప్పందము) వేసికొనగా శేషుడు వేంకటాచలమును చుట్టి గట్టిగ పట్టుకొనెను వాయువు తన బలముతో యీ పర్వతమునే ఎగరవేసెను ఈ శేషపర్వతమందే నివసించు విష్ణుమూర్తి వేంకటేశ్వరుడుగా ప్రసిద్ధి నొందెను త్రేతాయుగమందు వృషభాద్రియని, అంజనాద్రియని యీ వెంకటాచలమునకే పేర్లు గలవు

వేంకటాచలమాహాత్మ్యమున శ్రీ మహావిష్ణువు వేంకటేశ్వరుడుగా వెలయుటకొక కథ కలదు బ్రహ్మ విష్ణు రుద్రులలో మోక్షప్రదాత యెవ్వరని మునులందరు చర్చించుకొని నిర్ధారించుటకై భృగుమహర్షిని పంపిరి బ్రహ్మను రుద్రుని రజస్తమోగుణములు గలవారని తెలిసికొని పూజార్హత లేకుండునట్లు శపించెను ఆ శాపమున శివరూపమున పూజ లేక లింగరూపమున శివునికి పూజలు జరుగుచుండెను విష్ణువు వద్ద కేగిన వెంటనే విష్ణువు లక్ష్మిని విడిచిపెట్టి లేచివచ్చి భృగు మహర్షికి నమస్కరించెను అయినను ఆ విష్ణువు శాంత స్వభావమును పరీక్షింప దలచి వక్షస్థలమున తన్నెను విష్ణువునేమియు కోపించక ఆ మహర్షి పాదమునొత్తి శాంతింప జేసెను. ఆ సంఘటనకు కోపము వచ్చిన లక్ష్మీదేవి కొల్హాపురమున కేగెను అప్పుడు విష్ణువు శేషాద్రికి వచ్చి ఒక పుట్టలో దాగెను ఆ విషయము తెలిసికొనిన బ్రహ్మ గోరూపమును ధరించగా శివుడు దూడగా మారెను పుట్టలో నున్న విష్ణువునకు ఆవు పాల నిచ్చుచుండెను ఆవును కొన్న యజమానియైన చోళ రాజు ఆవుకు పాలు లేకుండుట గుర్తించి గొల్లవానిపై ఆగ్రహించెను గొల్లడు పుట్టలో పలికి ఆవు పాలు నిస్తున్నట్లు గమనించి దానిని కొట్టబోగా విష్ణువు గోవును రక్షించుటకై తన తల నడ్డుపెట్టెను ఆదెబ్బ విష్ణువుకు తగిలి రక్తము కారెను ఆ రక్తపు మరకలతో ఆవురాగా ఆ రక్తపుజాడలను బట్టి చోళరాజు పుట్ట వద్దకు పోయి చూచి జరిగిన వృత్తాంతము తెలిసికొని క్షమింపుమని విష్ణువును ప్రార్థించెను

లక్ష్మీదేవికై విచారిస్తున్న విష్ణువును చూచి వకుళ మాలిక యను పరిచారిక విచారకారణ మెరింగి ఆకాశ రాజు పుత్రియైన పద్మావతికి వృత్తాంతము ను చెప్పెను ఆ పద్మావతి విష్ణువును భర్తగా భావించి ప్రేమ పిపాసియై యుండగా హరి ఎరుకలసాని వేషములో వెడలి ఆకాశరాజుతో పద్మావతిని విష్ణువునకిచ్చి వివాహము చేయుమని చెప్పి పద్మావతిని శాంతపరచెను

తన వివాహమునకై విష్ణువు కుబేరుని వద్ద అప్పుగా ధనమును తెప్పించి లక్ష్మీదేవి సమ్మతితో పద్మావతిని వివాహ మాడి భక్తులకోరికలు తీర్చుటకై శేషాద్రియందే నిత్య నివాసముండెను ఆకాశరాజు ఆ వేంకటేశ్వరునికి ఆలయము నిర్మించెను అప్పుతీర్చుటకై వడ్డికాసులవా డయ్యెనందురు

కొన్ని శాసనములను బట్టి క్రీ శ 806 వ సం॥ లో ఆలయనిర్మాణము జరిగినట్లున్నది ఆరంభంలో శ్రీ వెంకటేశ్వరాలయం మాత్రమే వుండెదని కాల క్రమేణ శతాబ్దాల తరువాత చాలా మార్పులు వచ్చి వివిధములైన మండపములు గోపురములు నిర్మింప బడినట్లు కన్పించును

పగటికాలంలో మానవులు, రాత్రికాలంలో బ్రహ్మాది దేవతలు ఈ శ్రీనివాసుని సేవిస్తూ వుంటారని వరాహ స్వామి ప్రార్థనపై ఏడుకొండలపై నిత్యనివాసుడైనాడని తిరుమల క్షేత్రానికి వరాహమూర్తిని క్షేత్రపాలకునిగా వేంకటేశ్వరుడే నియమించి ముందుగా ఆక్షేత్రపాలకుని దర్శించి, పిమ్మటనే తన్ను సేవించు నియమాలను ఏర్పాటు చేసారని ఆ మాహాత్మ్యగ్రంథంలో వివరింప బడినది

ఆపదల మ్రొక్కులవాడై, ఆర్తులకు కొంగు బంగా రమై, వడ్డికాసులతో సంతృప్తిచెంది, భక్తులను కాపాడుచు కలియుగ ప్రత్యక్షదైవంగా ఆరాధింప బడుతూ వుండే వేంకటేశ్వరస్వామి కేవలము విష్ణు స్వరూపుడే గాక శివ స్వరూపుడు శక్తిస్వరూపుడు కూడ. దీనికి నిదర్శనముగా అనేక చిహ్నములు

(తరువాయి 46

# విజయదశమి - దసరా పర్వదినాలు

—కొంపగిరి జయప్రద

అమ్మలగన్న యమ్మ ముగ్గురమ్మల
మూలపుటమ్మ చాల పె
ద్దమ్మ సురారులమ్మ కడుపారడి
బుచ్చిన యమ్మ తన్నులో
నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల
నుండెడి యమ్మ దుర్గ మా
యమ్మ కృపాబ్ధి యిచ్చుత మహత్త్వ
కవిత్వ పటుత్వ సంపదల్.

దసరా వచ్చింది. దేశం నలుమూలలా జనులందరూ అత్యంత భక్తిశ్రద్ధలతో వైభవంగా జరుపుకునే పదిరోజుల పండుగ దేవీ శరన్నవరాత్రి ఉత్సవములు. దీనినే దసరా ఉత్సవము అనికూడ అంటారు. దుష్టశిక్షణ శిష్టరక్షణకై శక్తిస్వరూపిణిగా భక్తజనులకు కల్పవల్లిగా, ప్రేమానురాగాలలో మాతృమూర్తిగా కోరిన వారికి వరప్రదాయినిగా, అనేక రూపములతో పూజలందుకొంటుంది ఆ ఆదిపరాశక్తి. ఇంటింటా బొమ్మల కొలువులు, ఊరూరా ఉత్సవాలు ఒకటేమిటి! రకరకాల సంబరాలు చేస్తారు ఆ ముగ్గురమ్మల మూలపుటమ్మకు.

అయితే అసలు పదిరోజులు జరిగే యీ దసరాకు అర్థమేమిటి? దేవీ పూజలు జమ్మిపూజ ఆయుధపూజ పారువేట మొదలయినవాటి అర్థమేమిటో ప్రతి వారూ తెల్సుకోవాలి. కాలచక్ర భ్రమణంలో శరద్వసంత ఋతువులను 'యమ దంష్ట్రికలు' అంటారు. దీని ప్రభావం వల్ల జీవకోటి నానావిధములయిన రోగాలకు గురి అవుతుంది. ఈ ఉపద్రవాలను తప్పించుకొనటానికిగాను, మన పూర్వులు పెద్దలు ఇహపరసౌఖ్యాల కొరకు ఈ రెండు ఋతువుల ప్రారంభంలో నవరాత్రి ఉత్సవాలను చేయాలని చెప్పారు. 'దేవీభాగవతం'లో కూడా యీ విషయమే చెప్పబడింది. దసరాకు, పాడ్యమి నాడు కలశస్థాపనచేసి దేవతను ఆవాహన చేస్తారు. నవమి వరకు అమ్మవారికి పూజలూ హోమాలూ చేస్తారు. అందులో ఈ "శ్రీచక్రపూజ" చాలా ప్రధానమయినది. ఈ తొమ్మిది రోజులూ కన్యాపూజలూ సుమంగళుల పూజలూ చేస్తారు. మూలానక్షత్రం రోజు సరస్వతీపూజ, అష్టమినాడు దుర్గాపూజ, నవమినాడు చండీపూజ ఆయుధపూజ చేసి, దశమినాడు ఉద్వాసన చెబుతారు. దీనినే 'విజయదశమి' అంటారు. శరత్కాలంలో "అగస్త్య' నక్షత్రం ఉదయించే వేళ జైత్రయాత్రలన్నింటికీ అనుకూలమైనదని ప్రతీతి. రాముడు విజయం సాధించిందీ, అప్పటివరకు జమ్మిచెట్టుపైదాచిన ఆయుధాలను దించి అర్జునుడు ఉత్తరగోగ్రహణం చేసి విజయుడైనదీ ఈ రోజేనని పురాణాలు చెబుతున్నాయి. ఉత్తరదేశంలో విజయదశమి రోజున రావణ, కుంభకర్ణాది రాక్షసుల బొమ్మలు తగులబెడ్తారు. దీనినే రామలీలోత్సవం అంటారు.

ఈ దసరా పర్వదినాలలోనే అమ్మవారిని మహాలక్ష్మి, మహాకాళీ, మహాసరస్వతి దేవతలుగా ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి రూపాలుగా ధ్యానించి పూజిస్తారు. తద్వారా మానవజన్మ సార్థకతకు అవసరమైన జ్ఞానమును శక్తిని ధనమును సముపార్జించి భక్తులు ధన్యులవుతారని మన విశ్వాసము, నమ్మకము. ఈ దసరా రోజులలో దేవికి విశేషమైన అలంకారాలు చేస్తారు. పాడ్యమినాడు 'బాలత్రిపురసుందరి' మొదలు 'గాయత్రి' "శ్రీ అన్నపూర్ణ" "శ్రీ మహాలక్ష్మి" "శ్రీ లలితా

పరమేశ్వరి" "శ్రీ కనకదుర్గ" "శ్రీ మహాసరస్వతి" "శ్రీ మహాకాళి" "మహిషాసురమర్దిని" అలంకారాలు చేస్తారు. అమ్మవారి ఈ ఉగ్రరూపాల అనంతరం విజయదశమినాడు రాజరాజేశ్వరి అలంకారంలో ఉద్వాసన చెపుతారు. దేశంలో అన్ని ప్రాంతాలతో పాటు, అష్టాదశ పీఠాలుగా చెప్పబడిన పద్దెనిమిది దివ్య క్షేత్రాలలోనూ దేవీ శరన్నవరాత్రులు జగద్విగియమానంగా జరుగుతాయి.

"లంకాయాం శాంకరీ దేవి
కామాక్షీ కాంచికా పురే
ప్రద్యుమ్నే శృంఖలా దేవి
చాముండీ క్రౌంచ పట్టణే
అలంపురే జోగులాంబ
శ్రీశైలే భ్రమరాంబికా
కొల్హాపురే మహాలక్ష్మి
మాహుర్యే ఏకవీరికా
ఉజ్జయిన్యాం మహాకాళీ
పీఠయాం పురుహూతికా
ఓఢ్యాణే గిరిజా దేవీ
మాణిక్యే దక్షవాటికే
హరిక్షేత్రే కామరూప
ప్రయాగే మాధవేశ్వరీ
జ్వాలాయాం వైష్ణవీ దేవీ
గయా మాంగళ్య గౌరికా
వారణాస్యాం విశాలాక్షీ
కాశ్మీరేతు సరస్వతీ
అష్టాదశేషు పీఠేషు
యోగిభిః సేవసర్హితం
తేషాం స్మరణ మాత్రేన
మృత్యు దారిద్ర్య నాశనం ॥

పైనచెప్పిన అష్టాదశ పీఠాల మూర్తులను నిత్యం స్మరిస్తే సమస్త మృత్యు దారిద్ర్యనాశనం జరుగుతుందని అర్థం.

దశమినాడు జరిగే మరో పూజ "జమ్మిపూజ" దీనినే "శమీపూజ" అని కూడా అంటారు. తరువాత "ఆయుధపూజ" అనేది ముఖ్యమైనది. జమ్మివృక్షం పాపాలను పోగొట్టుతుందని శత్రువులను జయింపజేసే శక్తి కలదని పురాణాలు చెప్తున్నాయి. అనంత జీవకోటిని సృజించే బ్రహ్మ తన సృష్టి క్రమంలో అగ్నిని సృజించగా, ఆ అగ్నినుండి వెలువడే ఉష్ణతాపాన్ని భరించలేక దానిని శమీవృక్ష శాఖలలో నిక్షిప్తపరిచాడని, అగ్నిని శమింపజేసినది కాబట్టి ఈ వృక్షానికి 'శమీ' వృక్షమనే పేరువచ్చిందని, శమీ వృక్షంలోని ఉష్ణాన్ని తగ్గించేందుకే శమీ పూజ చేస్తారని అంటారు. "శమీ" పదం కాలక్రమేణా "జమ్మి" గా మారిందని పురాణాలు చెపుతున్నాయి. దీనినే "అపరాజిత" పూజ అని కూడా అంటారు.

"శమీ శమయతే పాపం
శమీ శత్రువినాశినీ
అర్జునస్య ధనుర్ధారీ
రామస్య ప్రియదర్శినీ"

పై శ్లోకం చదువుతూ ప్రదక్షిణం చేస్తారు. ఈ రోజే "ఆయుధపూజ" కూడా చేస్తారు. ఎవరి వృత్తి వారికి దైవ సమానమయినది. ప్రాణమున్న వాటినే కాక మనకు భుక్తిని చూపించే ప్రాణములేని వస్తువులనైనా పూజించటం మన సంప్రదాయం. దశపాపహరా దసరా అనగా దశవిధ మహాపాతకాలను పరిహరింపజేయునది దసరా. ఈ దసరా పండుగ కేవలం మూఢాచారం, శుష్క సంప్రదాయం కాదు. మన ఆచార సంప్రదాయాల వెనుక ఎంతో ప్రగతిశీల సందేశం ఇమిడి ఉంటుంది. మంచిచెడుల మధ్య జరిగే నిరంతర

(తరువాయి 40 వ పేజీలో)

వేసవి తరగతుల ప్రసంగం

# సర్వశాస్త్రముల సుధాసారములే షడ్దర్శనములు

—భగవాన్ సాయి దివ్య సందేశం

సైన్సు చెడ్డది కాదు. సైన్సు భగవంతుని విశ్వసించక పోలేదు కొంతమంది సైంటిస్టులు మాత్రం, దైవమంటే వ్యతిరేకంగా ఉంటున్నారు. విజ్ఞాన ఘనులైన మహర్షుల దృష్టితో, ఈనాటి వైజ్ఞానికుల దృష్టి ఎంత చిన్నది? ఆనాటి వైజ్ఞానికులు సూర్యప్రకాశము వంటి వారు ఈనాటి వైజ్ఞానికులు మిణుగురు పురుగులలాంటి వారు సూర్యుని ముందు ఇవి ఎంత? పరిశోధనలు చేయాలి కేవలం యంత్ర పరిశోధన కాదు, మంత్ర పరిశోధన కాదు హృదయ పరిశోధన చేయాలి. హృదయ పరిశోధనే నిజమైన ప్రమాణం యంత్ర పరిశోధన అల్ప ప్రమాణం. యంత్రమేమైనా చెడిపోతే ప్రమాణమే చెడిపోతుంది. ఈ యంత్రములు కేవలం మానవుడు సృష్టించినవేకదా! కనుక యంత్రప్రమాణములు అల్ప ప్రమాణములే, అయితే ఈనాడు ఈ మూర్ఖప్రమాణాలు అభివృద్ధి అవుతున్నాయి. వీటన్నింటికీ మనస్సే కారణము.

— బాబా

" వేదశాస్త్రంబులును వల్లెవేసియున్న
పద్యగద్యంబులను చెప్పగలిగియున్న
చిత్తశుద్ధియు లేకున్న చెడును వాడు
మనసే కారణమన్నిటికి మానవుండా! "

భారతీయ వాఙ్మయము కేవలము అంధవిశ్వాసమని వాదించువారలకు, సహేతుకమైన సమాధానమిచ్చి, సంతృప్తిపరచినటువంటి దివ్యదర్శనములె షడ్దర్శనములు వేదమునకు ఒకవిధమైన అర్థమునేగాక, వివిధ విధములుగా అర్థములను బోధించి విశ్వానికి అందించిన దివ్యసూత్రములే షడ్దర్శనములు వేదజ్ఞానమును విపులముగా వివరించి జగత్తునకు విజ్ఞాన తత్త్వమును విజృంభింపజేసినవే ఈ షడ్దర్శనములు అవిశ్వాసము అంతర్దర్శనము, వేదము— ఈ మూడు సూత్రములే ఈ దర్శనకర్తలకు ప్రధానమైన ముఖ్యసూత్రములుగా ఏర్పడినవి భూత, భవిష్యత్తు, వర్తమానములను మారనటువంటి సత్యాన్ని, విషయతత్త్వాన్ని ప్రపంచమునకు అందించి, మానవత్వములో వుండినటువంటి బలహీనతను, భయమును, సంశయమును, దుఃఖమును దూరము గావించినటువంటివి యీ షడ్దర్శనములే విశ్వమునకు యోగక్షేమమును ప్రబోధించి, యోగక్షేమ మార్గములనుకూడా అందించి, మానవత్వంలో మాలిన్యం లేకుండా నిర్మూలనం గావించి, నిర్మలత్వాన్ని అందించినటువంటి దివ్యసూత్రములే యీ షడ్దర్శనములు వేదము, వేదాంతం, వేదజ్ఞులు— సర్వాలూ ఒక్కటేననేటటువంటి ఏకత్వాన్ని ప్రబోధించి, దివ్యత్వాన్ని ప్రకటింపజేసినటువంటివి యీ షడ్దర్శనములు ఈ అన్నివిధములైన ప్రబోధములకు, ప్రచారములకు, పవిత్రతకు, వివేక విజ్ఞానములకు మూలకారణము మనస్సే ఈ మానసిక తత్త్వాన్ని అర్థం చేసుకొనే నిమిత్తమై, ఏకత్వంలోని అనేకత్వాన్ని విభజించి, అనేకత్వంనుండి ఏకత్వానికి మానవుని గొనిపోయే రాజమార్గమే యీ షడ్దర్శనములుగా రూపొందినాయి

ఇవియే న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, పూర్వమీమాంస, ఉత్తర మీమాంసములని ఆరు.

మొదటిది న్యాయం మిగిలిన ఐదు దశలకు యీ న్యాయమే ప్రాణం మానవునియొక్క సానుభూతిని, సమరసాన్ని, ఏకత్వాన్ని గుర్తించినటువంటి మానవుని యందు మాత్రమే ఈ న్యాయము, స్వేచ్ఛ, ఆనందము లభ్యమవుతుంది అనగా నాయకత్వమనేది కేవలం కొన్ని ప్రమాణములపై ఆధారపడి ఉన్నది విషయ ములు వివరించవలెననిన, వస్తువులను ప్రకటించవలె ననినను దీనికి కొన్ని ప్రమాణములు అత్యవసరం 'మాణము' అనగా కొలత 'ప్ర' అనగా ముందు దేనిని మనం విచారించవలెననిననూ ముందు ఒక విధమైన ప్రమాణం అవసరం కొలతబద్దచేత కొన్ని వస్తువులను మాత్రమే దీనితో కొలత వేయవచ్చును పదార్థమునకు ఒక కొలత, విజ్ఞానమునకు ఒక కొలత, సుజ్ఞానమునకు ఒక కొలత, ప్రజ్ఞానమునకు ఒక కొలత, అజ్ఞానమునకుకూడనూ ఒక కొలత— అన్నింటికీ ప్రమాణం అత్యవసరం ఈ ప్రమాణములేక ఒక వస్తువునుగాని, విషయమునుగాని, ఒక వ్యక్తిని గురించి గాని మనం మంచిచెడ్డలుగా నిర్ణయించలేం ఈ అన్ని ప్రమాణములుకూడనూ మనస్సు పైననే ఆధారపడి వుంటున్నాయి

ఈ ప్రమాణములు నాలుగువిధములు 1. ప్రత్యక్ష ప్రమాణం. 2 అనుమాన ప్రమాణం 3. ఉపమాన ప్రమాణం. 4. శబ్దప్రమాణం ఈ నాలుగు ప్రమాణములచేత మానవునియందున్నటు వంటి సర్వ సంశయములను నివారణ గావించి, మానవత్వంయొక్క విశిష్ఠతను గుర్తింపజేసి, సత్య స్వరూపాన్ని నిరూపణ గావించి, మానవత్వాన్ని సార్థకం గావించుచూ వచ్చింది ఈ "న్యాయము" అనే దర్శనము ప్రత్యక్షమనగా ఏమిటి ? కేవలం ఇంద్రియ గోచరమై యుంటటిది "ప్రత్యక్షము" అని భావిస్తున్నాం. కంటితో చూచినటువంటిది ప్రత్యక్షము చెవులతో విన్నటువంటిది ప్రత్యక్షము చేతులతో చేసినటువంటిది ప్రత్యక్షము కాని ఈ ఇంద్రియ ములు కొన్ని విధములైన వ్యాధులతో కూడటంచేత యీ ప్రత్యక్షము సరియైన ప్రమాణంకాదు కన్ను చూచినది ఇది నలుపు, తెలుపు, ఎరుపు అని నిర్ణ యిస్తూ వచ్చినది ఈ ప్రమాణము సత్యమని ఏరీతిగా చెప్పవచ్చు ? ఈ ఇంద్రియముల లోపల మనస్సు ఆవరించి, మనస్సుయొక్క ఇష్టా అయిష్టములపై దీనిని నిర్ణయించటానికి పూనుకుంటుంది ఇదియేగాక యీ ఇంద్రియములుకూడనూ కొన్ని రోగములతో పీడింప బడుతుంటుంది ఈ కంటి దృష్టి ఆరోగ్యముగా ఉండి నప్పుడు నలుపు నలుపు, తెలుపు తెలుపు, పసుపు పసుపుగా కనిపిస్తుంది మనలో కామెర్లు బయలుదేరి నప్పుడు కన్ను పసుపుపచ్చగా మారుతుంది చూచిన వన్నీ పసుపు పచ్చగానే కనిపిస్తుంటాయి ఇది ఎట్లా ప్రత్యక్ష ప్రమాణం ? రోగముతోకూడిన నేత్రంతో చూచినవన్నీ ప్రత్యక్షము అవుతాయా ? కనుక బాహ్య ఇంద్రియములన్నియూ కేవలము మనః ప్రభావముతో కూడినటువంటివే ఇక నోటితో రుచి చూచినటువంటిది ప్రత్యక్షము, నేను తిన్నాను, రుచి చూచాను— ఇది సత్యము అని వాదించవచ్చును ఇదికూడనూ ప్రత్యక్ష ప్రమాణం కాదు ఎట్లా ? నీవు ఆరోగ్యముగా వుండి నప్పుడు తీపి తీపి, కారము కారము, చేదు చేదుగా వుంటుంది నీకు మలేరియా జ్వరం వచ్చిందంటే, నాలుక తీపికూడా చేదుగా రూపొందింపజేస్తుంది కాబట్టి ఇది ప్రత్యక్షమని ఏరీతిగా వాదించగలవు ? ఇద్ది తీపిగనే వున్నది కానీ నీవు చేదంటున్నావు ఈ సమయమునందు యదార్థమునుకూడా ఒక ప్రమాణంగా రూపొందింపజేసుకోవాలి ఇంద్రియ ప్రమాణమే కాకుండా, పదార్థ ప్రమాణమునుకూడా మనం విచా రించాలి ఇంద్రియం చేదు అని చెప్పినటువంటిది, పదార్థమును విచారిస్తే, అది తీయగా ఉంటుండాలి

కనుక ఇది ప్రమాణమునకు సరియైన ఆధారముకాదు ఇక మూడవది పాలను ప్రత్యక్షంగా చూస్తున్నాం ఈ పాలలో కొంచెం మజ్జిగ తోడువేసినప్పుడు పెరుగుగా మారిపోతుంది ఇది ప్రత్యక్షమే పాలు పెరుగుగా మారిపోయింది పెరుగును కవ్వంతో మజ్జిగ చేసి నప్పుడు వెన్న తేలుతుంటుంది వెన్నను కాచితె నెయ్యిగా మారుతుంది ఈ నెయ్యి, వెన్న, మజ్జిగ, పెరుగు— అన్నీ పాలలోనే ఉంటున్నాయి కానీ వివిధ మార్పులచేత, వివిధ కర్మలచేత, వివిధ కాలము లలో వేరువేరుగా రూపొందుతూవచ్చింది కాని ఇది ప్రత్యక్షము కాదని చెప్పటానికి వీలుకాదు ఇది ప్రత్యక్షమే పాలు పెరుగుగా మారింది పెరుగు వెన్నగా మారింది వెన్న నెయ్యిగా మారింది ఇది దేనిలోనూ తిరిగి చేరదు మజ్జిగనుంచి వచ్చిన వెన్న ముక్కలుచేసి మజ్జిగలో వేసిన అది మజ్జిగలో కలవదు పాలలో వేసినా కరగదు ఇది ప్రత్యేకంగానే ఉంటుంది ఎక్కడనుంచి వచ్చింది ఇది? పాలనుంచే వచ్చింది పెరుగునుంచే వచ్చింది మజ్జిగనుంచే వచ్చింది కానీ తిరిగి వాటితో చేరటంలేదు దీనినే 'న్యాయమీమాంస' అని కూడనూ చెప్పవచ్చును 'మీమాంస' అనగా ఏ మాంసము కాదు వస్తువుయొక్క చివరి నిష్కర్షమే మీమాంసము నెయ్యి ఆఖరి అంశం ఈ నెయ్యికి యిక అంత్యములేదు పాలయొక్క అంత్యము నెయ్యే చివరి నిష్కర్షమే మీమాంస మన్నారు కనుకనే ఈ 'న్యాయము' అనేటటువంటిది ప్రత్యక్ష ప్రమాణంగా తీసుకోవటం, ఇది కొంతవరకు సాధ్యమవుతుంది

ఈ న్యాయ సూత్రములను గౌతముడు ప్రబోధిస్తూ వచ్చాడు న్యాయశాస్త్రములకు కర్త గౌతముడు

గౌతమ సూత్రములనికూడా మరొక పేరు కలదు మహర్షులు అనేక తపస్సులుచేసి, అనేక విధముల విచారణలు సలిపి, ప్రచార ప్రబోధలు సలపటానికి, పరిశోధనలుకూడా సలిపి ప్రమాణములుకూడనూ విశ్వ సించి యీవిధమైన నిర్ణయాలకువచ్చారు అనాటి ప్రమాణ

## అంతర్వీక్షణ

కారణ బీజము గాల్చియు
ధీరుడవై పరమపదము సొంపుగ గనుమీ
మారుచునుండెడి జగమున
మారని నీ నిజము నెపుడు మరువకుమోయీ
పంక మందున జన్మించి పంకజంబు
పంక మంటక నెల్లొందు పగిది నీవు
పరగ సంసార మందున పట్టువడక
అంటి అంటని విధమున అరుగవోయి
ఎన్నగా స్వప్నము వేగ
తిన్నగ నీ వుండు మెపుడు ధీరత మెరయన్
ఉన్నది కన్నది సర్వము
ఎన్నగ నాశన పరములు యేమనవచ్చున్
మాంసమయమైన తోలుబొమ్మను గుంగోన
దొంగవలెను దాగియు తొంటిరూపు
మరచి యుండుచు నుంటివి మాయజిక్కి
మనిషిరూపును గైకొన్న మాధవుడవు

— గుడిశేవ నరసింహారావు

కర్తలు, పరిశోధన కర్తలకు ఈనాటి కర్తలకు పోలికయే లేదు అనాటి పరిశోధన చేసిన మహర్షులు కేవలం మనస్సునుదాటి, దాని తరువాత ఉన్నతమైన మనస్సును (Super Mind) దాటి,దాని తరువాత Higher Mindను కూడా దాటి, అక్కడనుండి Illuminated Mind ను కూడాదాటి, Over Mind ను కూడా దాటి వారు విశిష్టమైన దివ్యత్వాన్ని దర్శించగలిగారు ఈనాటి వైజ్ఞానులు కేవలం Lower Mind నందే ఉండి, ఈ విశిష్టమైన దివ్యత్వాన్ని అర్థం చేసుకొనలేక, అనాటి ఋషులు కూడా కనిపెట్టలేనటువంటి విషయాలను ఈనాడు మేము కనిపెట్టామని అహంకారంతో విర్రవీగుతున్నారు

ఆనాడు ఋషులు కనిపెట్టలేనటువంటివి కాదు యీనాడు వీరు కనిపెట్టేటటువంటివి ఆనాడు ఋషులు ఇవన్నీ వ్యర్థమైనటువంటివని Low Class కు సంబంధించినవని వదిలిపెట్టినవి యీనాడు వైజ్ఞానికులు కనిపెడుతున్నారు ఈనాడు వైజ్ఞానికులు కనిపెట్టేటటువంటివి అన్నియూ ప్రాకృతమైనటువంటివే పదార్థములతో కూడినటువంటివే కాని ఆనాటి ఋషులు కనిపెట్టినటువంటివి పరార్థముతో చేరినటువంటివి కనుకనే ఈనాటి వైజ్ఞానికులు, ఆనాటి మహర్షులు కనిపెట్టినటువంటి వాటినంతా కూడనూ విశ్వసించలేకపోతున్నారు వీరు విశ్వసించినా, విశ్వసించలేకపోయినా అవి పరమ సత్యములే ఈ అల్పమైన జ్ఞానమునకే అహంకారపడి, ఆత్మతత్త్వమైన దైవత్వాన్నికూడనూ విస్మరిస్తున్నారు Science చెడ్డది కాదు. సైన్సు భగవంతుని విశ్వసించక పోలేదు. కొంతమంది సైంటిస్టులు మాత్రం దైవమంటే వ్యతిరేకంగా ఉంటున్నారు. కొంతమంది అల్పబుద్ధులే దేవునికి వ్యతిరేకంగా తయారవుతున్నారు మిణుగుడు పురుగు చీకటిలో నాకంటే ఇంకా గొప్ప వెలుతురుగల వారెవ్వరూలేరని విర్రవీగుతుందట సూర్యునిముందు ఇది ఎంత? అటులనే విజ్ఞానఘనులైన మహర్షుల దృష్టి లోపల, ఈ అజ్ఞానంతోకూడిన ఈ వైజ్ఞానికుల దృష్టి ఎంత చిన్నది? వీరంతా మిణుగుడు పురుగుల లాంటివారే కాని ఆనాటి వైజ్ఞానికుల తత్త్వము సూర్యప్రకాశము వంటిది కనుక విచారణచేత ఇంద్రియములను మాత్రమే లక్ష్యముగా నుంచుకొని ఇదియే ప్రత్యక్ష ప్రమాణమని అనుకోవటం — ఇది పెద్ద అజ్ఞానమే పరిశోధన చేయాలి కేవలం యంత్ర పరిశోధనకాదు మంత్ర పరిశోధన కాదు హృదయ పరిశోధన చేయాలి ఈ హృదయ పరిశోధనే నిజమైన ప్రమాణం యంత్ర పరిశోధన అల్పప్రమాణం యంత్రమేమైనా చెడిపోతే ప్రమాణమే చెడిపోతుంది ఈ యంత్రములు ఎవరు సృష్టించినవి? కేవలం మానవ కల్పితములే మీ అందరికీ బాగా తెలుసు ఈ కంప్యూటర్స్‌ను అనేకమంది వైజ్ఞానికులు సృష్టిస్తున్నారు ఈకంప్యూటర్ ఏలాంటిది? కేవలం ఒక రవ్విష్ వంటిది ఒక యంత్రంలో పైన బియ్యంవేస్తే క్రింద బియ్యం పిండి వస్తుంది ఏది వేస్తే క్రింద ఆ పిండి వస్తుంది అదే విధంగా యీ సైంటిస్టు కంప్యూటరుకు ఏది ఫీడింగ్ యిస్తే అది వస్తుంది ఆ Adjustment లో ఏదైనా కొంచం పొరపాటు జరుగుతే అంతా ప్రమాదమే ప్రమాణం కాదు ఈనాడు కంప్యూటర్స్ రిజల్ట్స్ చూస్తునే ఉన్నాము ప్యాసయినవారిని తప్పినట్లుగా, తప్పినవారిని ప్యాసయినట్లుగా తెలుపుతున్నాయి కనుక యంత్రి ప్రమాణములు అల్ప ప్రమాణములే, ఈనాడు యీ మూర్ఖప్రమాణాలు అభివృద్ధి అవుతున్నాయి వీటన్నిటికీ మనస్సే కారణము

హృదయ ప్రమాణమే ప్రత్యక్షప్రమాణం ఇదియే సరియైన న్యాయము కాని ఈనాటి న్యాయము విరుద్ధమైనదిగా ఉన్నది న్యాయమును అన్యాయముగా, అన్యాయమును న్యాయముగా మారుస్తున్నారు ఒక వెయ్యి రూపాయలు లంచంయిస్తే అన్యాయం న్యాయం అయిపోతుంది న్యాయం అన్యాయం అయిపోతుంది ఇలాంటి న్యాయం న్యాయమవుతుందా? ఇలాంటి న్యాయస్థానములు న్యాయస్థానములవుతాయా? కానే కాదు ఇవన్నీ పొట్టకూటికై పాటుపాడే న్యాయములు ఆనాటి కాలములో ఇట్టి న్యాయములు కావు తన పర అనే భేదము లేకుండా న్యాయాన్ని విచారించి సక్రమమయిన మార్గంలో పెట్టేటటువంటివారు ప్రతి మతమూ ఇలాంటి న్యాయాన్ని సక్రమంగా పాటించింది మతములు వేరు కావచ్చు న్యాయం అందరికీ ఒక్కటే మహమ్మద్ న్యాయాన్ని చక్కగా పాటించేవాడు తప్పులు చేసేవారికి నూరు కొరడా దెబ్బలని మహమ్మద్ మతంలో పేర్కొనినారు అయితే అలాంటి దోషం మహమ్మద్ కుమారుడే చేశాడు కుమారుడే అని

( తరువాయి 37 వ పేజీలో )

# భృగు మహర్షి

పురాణపండ 'శ్రీచిత్ర'

బ్రహ్మ హృదయమునుండి జన్మించినవాడు భృగుడు నవబ్రహ్మలలో ఒకడుగా ప్రఖ్యాతి చెందాడు ఈయన భృగువంశ మూలపురుషుడు కర్దమ ప్రజాపతి కుమార్తెయగు ఖ్యాతిని వివాహంచేసికొనినాడు దాత, విధాతయను ఇద్దరు కుమార్తెలను కనినాడు ఉశన యను నామెను వివాహము చేసుకొని శుక్రుని, పులోమను పెండ్లియాడి చ్యవనుని బడశాడు

ఒకానొక సమయాన త్రిమూర్తులలో అధికులెవరను చర్చ వచ్చింది ఆ విషయం తేల్చుకోవాలని అందరూ భృగువును పంపారు భృగువు తిన్నగా బ్రహ్మ వద్దకు వెళ్ళాడు బ్రహ్మ సృజన కార్యక్రమములో ఉండి వచ్చిన అతిథిని చూచీ చూడనట్లుగా ఉపేక్షాభావంతో చూచాడు భృగువు కోపంతో బ్రహ్మను శపించాడు అనంతరం కైలాసం చేరాడు అక్కడ శివపార్వతులు నృత్యం చేస్తూ భృగువును ఆహ్వానించలేదు శివుని శపించాడు తరువాత వైకుంఠం చేరాడు విష్ణువు గౌరవించకపోతే భృగువు కోపంతో శ్రీహరి వక్ష స్థలమును పాదంతో తన్నాడు అప్పుడు విష్ణువు వినయంతో భృగువునకు అతిథిమర్యాదలు చేశాడు భృగువు ఆనందించి శ్రీహరిని కీర్తించాడు త్రిమూర్తులలో విష్ణువే అధికుడని సభకు నివేదించాడు

యువనాశ్వుడను రాజు బిడ్డలు లేక సంతానార్థియై భృగుమహర్షి ఆశ్రమానికి వెళ్ళాడు అతనిచేత పుత్రకామేష్టి చేయించి,మంత్రపూరితమైన జలముతో నింపిన కలశమిచ్చి భార్యకిమ్మనినాడు ఒక రాత్రివేళ రాజునకు దాహం కాగా పొరపాటున ఆ కలశములోని జలమును రాజు త్రాగాడు అది తెలిసికొని భృగుమహర్షి "రాజా నీ భార్య త్రాగవలసిన నీరు నీవు త్రాగావు కాబట్టి నీవే గర్భం ధరించి పుత్రుని కంటావు అంతా దైవానుగ్రహం" అని చెప్పి రాజును పంపుతాడు కాలక్రమాన ఆ రాజు గర్భందాల్చి నూరేండ్లకు అతని ఎడమభాగము నుండి ఒక బాలుడు జన్మించుతాడు అతడే మాంధాత షట్చక్రవర్తులలో ఒకడు

భృగుమహర్షి కైలాస ప్రాంతమున మణికూట పర్వతమున పర్ణశాల నిర్మించుకొని తపస్సు చెయ సాగాడు పులిముఖుడు అందకత్తె అయిన తన భార్యతో అక్కడికి వచ్చి "మహర్షి! నేను సుముఖుడను పేరు గల విద్యాధరుడను ఈమె నా భార్య స్వర్గలోకమునకు వెళ్ళి తిరిగివచ్చుచుండగా నాకు పులిముఖంవచ్చింది ఇది పోవు ఉపాయం చెప్పండి" అని ప్రార్థించాడు భృగువు దివ్యదృష్టితో గ్రహించి సుముఖా! నీవు ఏకాదశి ఉపవాసం చేసి, ద్వాదశినాడు తలంటి నీరు పోసుకున్న దోషం వలన నీకీ పులిముఖం వచ్చింది మాఘస్నానం చేసిన నీకీ పులి ముఖం పోతుంది" అని చెప్పాడు అతను మాఘమాస స్నానం చేయగా దివ్య సుందరుడైనాడు

కార్తవీర్యార్జుని చేతిలో మరణించిన జమదగ్నిని భృగువు తన తపోమహిమచేత బ్రతికించాడు భృగు మహర్షి ఆదేశానుసారం పరశురాముడు శివుని మెప్పించి భార్గవాస్త్రమును సంపాదించాడు భరద్వాజునకు సృష్టి క్రమమంతయూ వివరించి చెప్పాడు భృగువు జ్యోతిశ్శాస్త్ర సారమును రచించాడు ఆ గ్రంథమే భృగు సూత్రములు అను పేర ప్రసిద్ధి కెక్కింది ఈతని పేర స్మృతి యొకటి కలదు ఈతను ధర్మశాస్త్ర ప్రవక్తగా పేరొందాడు సత్యమాచరించడంవలన శారీరక, మానసిక దుఃఖములు దూరమగునని భరద్వాజునకు తెలియజేశాడు భృగుమహర్షి చరిత్ర మనకు ఆదర్శప్రాయమైనది ○

# ఆంధ్రప్రదేశ్‌లో ....
# చలనచిత్ర పరిశ్రమ అభివృద్ధికి ....

* వినోదపు పన్ను రాయితీ..
* పూర్తిగా రాష్ట్రంలో నిర్మించే చిత్రాలకు 5 పర్సంటేజి పాయింట్లు..
* అదులో తక్కువ బడ్జెట్ చిత్రాలకు తిరిగి 50 శాతం వరకు వినోదపు పన్నులో రాయితీ
* రాష్ట్రంలో నిర్మించే తెలుగు చిత్రాలలో అశ్లీలానికి, హింసకు ప్రాధాన్యం లేకుండా వున్న చిత్రాలకు ఒక్కొక్కరికి మూడు లక్షల రూపాయల వరకు సబ్సిడీ
* సబ్సిడీ చెల్లింపులకై మూడుకోట్ల రూపాయల విడుదల
* తెలుగు చిత్రసీమలోని కళాకారులు సాంకేతిక నిపుణులు, అల్పాదాయ వర్గాల వారికి స్వల్పకాలిక పద్ధతిపై గృహవసతి కల్పన
* రాష్ట్రేతర ప్రాంతాలలో నివసించే తెలుగువారి కొరకు తెలుగు చలన చిత్రోత్సవాల నిర్వహణ
* సినిమా థియేటర్ల నిర్మాణానికి దీర్ఘకాలిక ఋణాల మంజూరు..
* చలనచిత్ర నిర్మాణ వ్యవస్థాకల్పనకై అదనంగా మూడుకోట్ల 45 లక్షల రూపాయల విడుదల..
* ప్రభుత్వం అమలుపరుస్తున్న అభివృద్ధి కార్యక్రమాల ప్రచారానికి డాక్యుమెంటరీ న్యూస్ రీళ్ళ నిర్మాణం ..

మీ కోసం .

మీ సేవలో..




**ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర చలనచిత్ర అభివృద్ధి సంస్థ**

10-2-1, ఎ. సి. గార్డ్స్

హైదరాబాద్ - 520 028

# సర్వా ఆశా సమమిత్రం భవతు

డా॥ రాపర్ల జనార్ధనరావు

"అన్ని దిక్కులవారు నాకు మిత్రులగుదురు గాక" అను ఈ ఋషిభావన అధర్వణవేదము (19-15-6)లోనిది పూర్తిపాఠము తెలుసుకుంటే భావం మరింత స్పష్టమై స్ఫూర్తినిస్తుంది ప్రాచీన ఋషి భావనల యెడల ఆధునిక ప్రజలకు ఆదరణ హెచ్చుతుంది ఋషివాణి, ఒక ఆత్మవాణి యనీ, అమృతవాణి యని, మనం గ్రహించగలుగుతాం గ్రహించి, మన ప్రాచీన సంస్కృతి యెడల మన హృదయాంతరాలలో గౌరవస్థానం కల్పించుతాం

అభయం మిత్రాద్ అభయం అమిత్రాద్
అభయం జ్ఞాతాద్ అభయం పురోయః
అభయం నక్తం అభయం దివానః
సర్వ ఆశా సమమిత్రం భవతు॥

"మిత్రులనుండి ఏన్ని భయపడనీయకు మిత్రులు కానివారి నుండి (అమిత్రులు) భయపడనీయకు తెలిసిన దానినుండి (తెలిసిన వారినుండి), భయపడనీయకు తెలియని దానినుండి (పురోయః) భయపడనీయకు అన్ని దిశల వారును నాకు మిత్రులగుదురు గాక" అను ఈ మంత్రము ఎంతటి భావోత్కృష్టత కలిగినది అన్ని భయములనుండి తొలగింపబడి "అభయం అభయం" భయములేదు, భయములేదు అను ఒక ఓదార్పు బాధితుల హృదయానికి హత్తుకునే లాగున తెల్పబడింది వేదమంత్రాలంటే ఏవో అర్థంకాని సంగీతరూపమైన శ్లోకాలు అనే భావన పనికిరాదు

ఋక్కులు లేక వేదమంత్రాలు విపులీకరించి, వాని యందలి విశాలమైన విశ్వభావన తెలియుట ప్రతి భారతీయుని కర్తవ్యము "అన్ని దిశలవారును, అనగా అన్ని దేశములవారును నాకు మిత్రులగుదురుగాక" అను భావము ఆదికాలమునాటి ఋషులు మనకు అందించినారని మనమెంతో గర్వించవలయును

"మిత్రుల అమిత్రులనుండి గాని నేను భయపడకుండ ఉండుగాక, తెలిసిన జ్ఞానము, తెలియని అజ్ఞానము నుండి గాని ఎట్టి భయములు పొందకుండా ఉండెదను గాక అన్ని దిశలవారును నాకు మిత్రులయ్యెదరు గాక" అను ఉన్నతమైన భావన మన హృదయసీమలను విశాలపరచి, సంకుచితత్వము, సందేహములను తొలగించే "సర్వ చింతా వివర్జితః" అన్ని సందేహములను విడి సర్వప్రాణుల యెడల సర్వ ప్రజల యెడల మిత్రభావమును ప్రతిష్ఠింపచేయుట ఒక ఉత్కృష్ట భావన

సూర్యుని గూర్చిన ప్రశంస వాక్యములలో ఒకటి "మిత్రో జనానాం చేతయతి" అనగా సూర్యుడు ప్రజలను చైతన్యవంతులను చేయుచున్నాడు సూర్యునకు 'మిత్రుడు' అను పేరుండుట గమనీయము ఆదిత్యుడు, సవితుడు, భార్గవుడు, భాస్కరుడు మొదలుగాగల అనేక నామములు కలిగి సూర్యోపాసన చేసెడి వారికందరకు సర్వ ప్రజలు మిత్రులగుదురు

మహాత్మాగాంధీజీకి పాశ్చాత్యులలో రాజవంశమునకు చెందిన మిస్ స్లేడ్ (మీరాబెన్) సరిహద్దు గాంధీ గఫూర్ ఖాన్ మొదలగు అనేకులు ఆయనకు మిత్రులగుట చూచెను నెహ్రూ, రాధాకృష్ణన్, రవీంద్రనాథ ఠాగూరు, జిడ్డు కృష్ణమూర్తిగార్లకు అంతర్జాతీయముగ పెక్కుమంది మిత్రులుండుట గమనార్హము

"విశ్వమసి విశ్వాయుః"
నీవే విశ్వము అగుచున్నావు ○

## నారద భక్తిసూత్రాలు-35

# భక్తి దర్శనాచార్యులు

—"శాంతిశ్రీ" జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి

బలిచక్రవర్తి :

ఈ చక్రవర్తి మహాభక్తుడైన ప్రహ్లాదుని మనుమడు ఈయన తండ్రి విరోచనుడు బలి బలవంతుడే కాదు, మహా ధీరుడు యజ్ఞయాగాలు చేసి ముల్లోకాలు జయించి మహాకీర్తి పొందాడు ఇంద్రవైభవం హరించి త్రిలోక చక్రవర్తి అయినాడు క్రమంగా ఆయనకు అధికార గర్వం ఎక్కువైంది

శ్రీమహావిష్ణువు వామనావతారం దాల్చి బలిచక్రవర్తి యజ్ఞానికి వెళ్ళాడు వామనమూర్తిలోని వర్చస్సు వేదపాండిత్యానికి ముగ్ధుడై బలి 'ఏమి కావాలో అడుగు' అన్నాడు. 'మూడుఅడుగుల నేల చాలు' అన్నాడువామనుడు "ఇంత చిన్ని కోరిక కోరతగునా! మడులు మాన్యాలు కానీ, మణులు కాంతామణులుగానీ, రత్నహారాలు కానీ, అగ్రహారాలు కానీ కోరుకో" అన్నాడు చక్రవర్తి "నా పాలికిదే బ్రహ్మాండం ఇయ్యి బాబూ" అన్నాడు వామనుడు

శుక్రాచార్యుడిది గమనించి ఈ వటువు మామూలు బ్రాహ్మణ వటువు కాదు వామనావతారమెత్తి వచ్చిన విష్ణువులాగున్నాడు అనుకొని "రాక్షసరాజా! ఇతడు రాక్షసాంతకుడైన శ్రీ మహావిష్ణువు ఏ దానము ఈయవద్దు" అన్నాడు

సత్యసంధుడైన బలిచక్రవర్తి ఆలోచించి శుక్రనీతి వినక "విష్ణువే స్వయంగా దానం గ్రహించడానికి రావటం నా భాగ్యం కదా! విష్ణుమూర్తి చేయి క్రిందై నా చేయి పైనుండటం నా అదృష్టం కదా! ఇందులో నిరయంబైన నిబద్ధమైన ధరణీనిర్మూలనంబైన తిరుగన్ నేరదు నాదు జిహ్వ" అని శ్రీహరికి కాళ్ళు కడిగి దానం చేశాడు

వామనుడు త్రివిక్రముడైనాడు ఒక అడుగుతో భూమిని రెండవ అడుగుతో ఆకాశాన్ని కొలిచి "మూడవ అడుగు స్థలం ఎక్కడ" అన్నాడు "నా శిరంపై పెట్ట" మన్నాడు మహాభక్తుడైన బలిచక్రవర్తి

మహావిష్ణువు మూడవఅడుగు బలిశిరముపై మోపాడు మాధవుడు బలి హృదయంలోని పరమ భక్తి గ్రహించాడు ఆ భక్తికి వశుడైనాడు బలి గృహద్వారానికి తానే గదాధరుడై కావలికాయసాగాడు భగవంతుడు భక్త పరాధీనుడు కదా!

ఈ బలి చిరంజీవి భక్త్యాచార్యులలో ఈయన గణ్యమానుడు ఆత్మనివేదనం జరిపిన భక్తవర్యులు కొద్ది మందిలో యీయన అగ్రగణ్యుడు

బద్ధుండై గురు శాప తప్తుడయి తా
బంధు ప్రజత్యక్తుడై
సిద్ధైశ్వర్యము కోలుపోయి
విభవక్షీణుండునై పేదయై
శుద్ధత్వంబును సత్యమున్ కరుణయున్
సొంపేమియున్ తప్పడు
ద్బుద్ధుండై యజమాఖ్యమాయు
గెలిచెన్ పుణ్యుండితండల్పుడే

## హనుమంతుడు

ఈయన తండ్రి కేసరి తల్లి అంజనాదేవి అంజనాదేవి సంతానార్థమై రుద్రవాయువు అగ్నిదేవాదులను ధ్యానించింది పెక్కేండ్లు తపస్సు చేసింది కేసరికూడా ఘోర తపస్సు చేశాడు వారి తపస్సు ఫలించింది రుద్రవాయువు అగ్నిదేవాదులు కటాక్షించారు మహా తేజస్వియైన బాలుడు జన్మించాడు ఆ దేవతలు బాలుని తమ బిడ్డగానే భావించి వరాలు ప్రసాదించారు ఆ బాలుడే ఆంజనేయుడు

ఒకసారి తూర్పు కొండపై పెద్ద పండువలె ఉదయిస్తున్న ఉదయభాను బింబాన్ని చూచి ముచ్చటపడి పట్టుకొందాము అనుకొన్నాడు ఇంతలో రాహువు సూర్యుని మ్రింగబోతున్నాడు అది చూచి ఆంజనేయుడు రాహువును ఒక్క గుద్దు గుద్దాడు రాహువు వెళ్ళి ఇంద్రుని కాళ్ళపై పడ్డాడు ఇంద్రుడు వచ్చి ఆంజనేయుడెవరో అనుకొని వజ్రాయుధం విసిరాడు అది వచ్చి ఆంజనేయుని హనువుకు తగిలింది అందరు హనుమా అని అన్నారు హనుమంతుడు మూర్ఛపోయినాడు వాయుదేవుడిందుకు కోపించి వాయువును లోకంలో ప్రసరింపకుండ స్తంభింప జేశాడు గాలి ఎక్కడాలేదు. ఇది గ్రహించి ఇంద్రాదులు దిగివచ్చి వాయుదేవుని ఇష్టప్రకారం హనుమంతునికి ప్రాణం పోయటమే కాక అనేక వరాలు ప్రసాదించారు ఆ వర బలంచేత హనుమంతుడు మహా తేజస్సంపన్నుడైనాడు సూర్యదేవుని దగ్గర విద్యలు నేర్చుకొన్నాడు సంగీతశాస్త్రం రచించాడు సుగ్రీవుని మంత్రీశ్వరుడైనాడు

శ్రీరామలక్ష్మణులు సీతావియోగం పొంది తిరుగుతూ ఋష్యమూక పర్వతం చేరువకు వచ్చారు అప్పుడు సుగ్రీవునికి ధైర్యంచెప్పి తన రాజుకు శ్రీరామదర్శనం శ్రీరామ సఖ్య సౌభాగ్యం చేకూర్చాడు ఈ మంత్రీశ్వరుడు రామదర్శనం అయినప్పటినుండి హనుమంతుడు శ్రీరామునికి నమ్మినబంటు అయినాడు.

సీతాన్వేషణకై వెడలు వానరులలో హనుమంతునికే తన అంగుళీయకం ఇచ్చాడు శ్రీరామప్రభువు శత



యోజనాల దూరంగల సముద్రాన్ని గోష్పాదంవలె తేలికగా దాటి లంకలో సీతను దర్శించాడు రాక్షస దమనం మాత్రం కాక లంకాదహనం చేసి తిరిగి వచ్చాడు రామ నామ మహిమతో వారిధిపై వారధి కట్టి లంకపై దండు నడిపాడు లక్ష్మణస్వామికి ప్రాణదానం చేసిన మహాత్ముడు ఈమారుత తనయుడు విభీషణునికి రామ సాయుజ్య భాగ్యం కలిగించినవాడు ఈతడే రావణ వధకు తోడ్పడి రామ ఆగమన శుభ వార్త గుహునికి, భరతునికి అందించిన శుభచరితుడు

రామపట్టాభిషేకం అయిన తదుపరి సీతారామాంజనేయ సంవాదం జరిపి వేదాంత తత్వగ్రంధానికి మూలకారణభూతుడు అయినాడు ఈ మహాభక్తుడు

దాస్య భక్తికి ప్రసిద్ధుడైన వీనిలో అన్ని భక్తి విధానాలు సమ్మిళితమై వెలుగుతుంటాయి

రామకీర్తన సేయు స్థలమ్ములందు
విమల బాష్పాంబు పూర్ణ నేత్రములతోడ

ర్షమున అంజలి ఘటించి చిందులాడు
సుందరస్వామి! పాదాభివందనములు!

## విభీషణుడు

విశ్రవో బ్రహ్మకుమారులలో మూడవవాడు ఈయన ఈతని తల్లి కైకసి భార్య సరమ విభీషణుడు విష్ణుభక్తుడు సుగుణసంపన్నుడు రాక్షస కృత్యాలు వీనికి గిట్టవు రావణుని విమర్శించేవాడు అది అతనికి నచ్చలేదు పరాంగనాసక్తి పాపం అనీ సీతాసాధ్విని శ్రీరామునికి అప్పగించుట శ్రేయస్కరం అనీ హితము బోధించాడు అందుకు రావణుడు ఇతణ్ణి బాధించాడు అంత విభీషణుడు రాముని శరణు వేడుకొన్నాడు. దుష్ట రాక్షస సంహారంలో రామునికి తోడ్పడ్డాడు ఇతనినే లంకకు రాజుచేశాడు రాముడు

హృదయపూర్వకంగా రాముని నిత్యం తలచాడు మానసికంగా కొలిచాడు పునీతుడైనాడు భక్తాచార్యులలో శ్రేష్ఠుడైనాడు శరణాగతికి విభీషణుడు పెట్టినది పేరు కులం ఏదైనా గుణం ప్రధానం. తామరపూవు బురదలో పుట్టినా పరిమళాలు విరజిమ్మి దేవతామస్తకాలపై స్తవనీయంగా ప్రకాశిస్తుంది కదా! ఇతడూ అంతే విపరీత వాతావరణం తటస్థపడితే రామభక్తుడు ఇష్ట బంధువునైనా పరిత్యజిస్తాడు ఇందుకితని గాథ ఉదాహరణం ○

# మంచి మాట

సి. వేదపతి

అంతా బాగానే ఉన్నట్లు ఉంది

మనమంతా ఎదుగుతున్నట్లే ఉంది వైజ్ఞానిక శిఖరాలు ఎన్నెన్నో ఎక్కుతున్నట్లే ఉంది విశ్వ రహస్యాలని చాలా మటుకు కనుగొన్నట్లే ఉంది

అయినా, అద్దం తిరిగిన కథలలా అయిపోతున్నవి మన బ్రతుకులు
విరిగిన పాలల్లే మన మనసులు
మంచితనాన్ని మరిచిపోయి—
పెరుగుతున్న పాపమల్లే మన గుండెలు
స్వార్థం ద్వేషం నిండుకుపోయి—
విలువలు విరిగిపోయి- మనిషితనం మరిగిపోయి—

ఇదీ మన ప్రస్తుత అవ్యవస్థిత అస్తవ్యస్త స్థితి ఇప్పుడు మన మనస్సులకు క్షాళన కావాలి అందుకు ఉపకరిస్తుంది ఒక మంచిమాట మనస్సుకు ఎక్కి — మార్గదర్శకంగా ఉండే మాట సత్యం, ధర్మం, నీతి, న్యాయం, ప్రేమ, కరుణ, సహనం, సమదర్శనం, భగవద్భక్తి, ప్రపత్తి,- ఈ చల్లని గుణాలన్నిటినీ ప్రపంచించే మంచిమాట

ఇది ఈనాడు మనం అవశ్యం వినవలసిన చదువవలసిన సురుచిరవాణి

ఇట్లా— క్రమం తప్పక ప్రతి నెలా— మన మనస్సులకు వెలుగునిస్తూ, 'మంచిమాట'ను కుప్పలుగా పోస్తూ మన ముందుకు వస్తున్నది "శ్రీవాణి"

సంక్షుభిత మానవాళికి - ఒక స్వాదుమయ, శాంతిమయ, శ్రాంతిమయ, కాంతిమయ, క్రాంతిమయ - దర్శనం ఇవ్వడానికి - కుప్పలు తెప్పలుగా ఇటువంటివే మరెన్నో మంచిమాటలు కావాలి

అందుకే..

మంచిమాటల ప్రోగై, అట్లా మన ముందుకు నెల నెలా అక్షరాకృతిలో ప్రత్యక్షమవుతున్న "శ్రీవాణి" పరంపరాభివృద్ధిగా వర్ధిల్లవలెనని నా ఆకాంక్షలు శ్రీముఖవత్సర శుభాకాంక్షలు ○

# కొమరగిరి

( గత సంచిక తరువాయి )

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది 14-12-76

చిరంజీవులకు ఆశీస్సులు

ఇంతకు పూర్వం వ్రాసిన రెండు ఉత్తరములలో గురుభక్తి, మాతృభక్తి, పితృభక్తి, దైవభక్తి, సత్యం, అహింస, సోదరప్రేమలను గురించి వ్రాసాను ఈ ఉత్తరంలో 'పరోపకారము' గురించి వివరిస్తాను

పరోపకారము ఈ పరోపకారబుద్ధి అన్ని బుద్ధులలోకి మిక్కిలి శ్రేష్ఠమైనది అడుగడుగునా శాస్త్రములలో ఇది కనిపిస్తున్నది పరోపకారమనగా ప్రక్కవారికి, ఇతరులకు ఉపకారం అనగా మంచి చేయటం అని అర్థం ఉపకారం చేసేటప్పుడు మన మనస్సులో ఎట్టి స్వార్థం ఉండరాదు మనం ఈరోజున ఒకడికి ఉపకారంచేస్తే, భవిష్యత్తులో మనకు ఉపయోగ పడవచ్చుననే భావంతో చేయరాదు ఎట్టి ఫలాపేక్ష లేకుండా పరులకు నిస్వార్థబుద్ధితో సహాయం చేయటమే నిజమైన పరోపకారము ఇదే భావమును తెలిపెటటువంటి ఒక చక్కటి నీతిశ్లోకమును వ్రాస్తున్నాను

" పరోపకారాయ ఫలంతి వృక్షాః
పరోపకారాయ వహంతి నద్యః
పరోపకారాయ దుహంతి గావః
పరోపకారాయ సతాం విభూతయః "

అనగా "పరోపకారము కొరకు వృక్షములు ఫలములు ఇచ్చుచున్నవి పరోపకారము కొరకు నదులు ప్రవహించుచున్నవి పరోపకారము కొరకు గోవులు పాలు యిచ్చుచున్నవి పరోపకారము కొరకే సజ్జనుల సంపదలు వినియోగబడును" అని అర్థము వృక్షములకు, నదులకు, గోవులకు, సజ్జనులకు ఎట్టి స్వార్థము ఉండదు. పరోపకారము చేయటమే వాటి వారి పరమావధి ఇతరుల యిష్టమైన ప్రతిఫలం మాత్రం ఆశించవు. ఆలోచించు వృక్షములకు, నదులకు, గోవులకు అట్టి ఉదార స్వభావము, పరోపకార బుద్ధి గనుక లేకపోతే మానవజాతే నశించి వుండేది అదేవిధముగా సజ్జనులు తన సంపదను అనగా భౌతిక సంపదను, విద్యాసంపదను ఉదారంగా పరులకు దానం చేసే పరోపకారబుద్ధి గనుక లేకపోతె మానవజాతి మనుగడకే అవరోధం ఏర్పడి వుండెది కను ఇట్టి పరోపకారబుద్ధిని అందరూ అలవరచుకోవలెను "మానవసేవే మాధవసేవ" అని గీత బోధిస్తున్నది. జీవులకు నిష్కామబుద్ధితో సేవచేయడం అంటే సాక్షాత్ భగవంతునికి సేవ చేసినట్లె అవుతుంది ఏ ప్రాణికి ఉపకారం చేసినా సాక్షాత్ భగవంతునికి పూజ చేసినట్లె అవుతుంది నరునికి సేవచేసిన నారాయణుని అర్చించినట్లే పరులకు సేవచేయడం అంటే పరమేశ్వరుని పూజించినట్లే జీవుని సేవించడం అంటే శివుని ఆరాధించడమే కనుక పరులకు పరోపకారం చేయాలి తనకు ఉపకారం చేసిన వారికి మేలు చేయడంలో లేదు గొప్పతనం తనకు అపకారం చేసిన వారికికూడా ఉపకారం చేయడంలోనే వున్నది గొప్పతనం ఎదుటి వారిలోని తప్పులను తలపోయక వారికి మేలు చేయువాడే ఉత్తముడు ఇదే విషయాన్ని యీ క్రింది సుమతీ శతకం పద్యం బోధిస్తున్నది

" ఉపకారికి నుపకారము
విపరీతము కాదుసేయ వివరింపంగా

నపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాడు నేర్పరి సుమతీ"

ఇది అత్యున్నతమైన తత్త్వజ్ఞానము ఆ స్థాయికి చేరుకోవడం అంత తేలికకాదు, అందరికీ చేతకాదు అపకారికికూడా ఉపకారం చేయడం గొప్ప విశేషమే అయినప్పటికీ, యీ ఉపకారం చేయడంలో కొంత ఇంగితజ్ఞానం ఉండాలి, విజ్ఞతను ప్రదర్శించాలి, విచక్షణాజ్ఞానాన్ని కలిగి ఉండాలి గ్రుడ్డిగా అపకారికి కూడా ఎప్పుడూ ఉపకారం చేస్తూపోతుంటె, ఒక్కొక్కప్పుడు ప్రమాదంకూడా రావచ్చును కొంతమంది మూర్ఖుల విషయంలో, ముఖ్యంగా కృతఘ్నుల (చేసిన మేలు మరచువారు) విషయంలో, వివేకాన్ని ప్రదర్శించాలి, అట్టివారికి గుణపాఠం నేర్పాలి

అపకారం చేసేవారిని దండించుట రాజధర్మం దుష్టబుద్ధితో ఏ దేశం అయినా మన దేశంమీద దండెత్తి దురాక్రమణచేస్తే గట్టిగా ఎదుర్కొని బుద్ధి చెప్పాలి అపకారికికూడా ఉపకారం చేయడం ఉత్తమధర్మమని భావించి మెదలకుండా కూర్చోకూడదు ఉత్తమ ధర్మమేదో, ధర్మసూక్ష్మమేదో వివేకంతో గ్రహించాలి మాతృభూమిని రక్షించుకోవటం ప్రతి పౌరుని ప్రాథమిక కర్తవ్యం, విద్యుక్తధర్మం కనుక ఆయా పరిస్థితులనుబట్టి ఉత్తమ ధర్మమేదో, తక్షణ కర్తవ్యమేమిటో, వివేకంతో నిర్ణయించుకొని సందర్భోచితంగా, సమయస్ఫూర్తితో వ్యవహరించాలి పృథ్వీరాజ్ మీద గోరీమహమ్మద్ 17 సార్లు దండయాత్ర చేశాడు అనేక అకృత్యాలు నొనర్చాడు అన్నిసార్లు గోరీ మహమ్మదే ఓడిపోతాడు పృథ్వీరాజ్‌ను క్షమాభిక్ష కోరుకుంటాడు ఉదారబుద్ధితో పృథ్వీరాజ్ క్షమించి వదిలిపెడుతాడు అయినప్పటికీ గోరీ మహమ్మద్‌లో ఏమాత్రం పరివర్తనరాదు దుష్టబుద్ధితో మాయోపాయముతో జయచంద్రుని వలలో వేసుకొని, పృథ్వీరాజ్‌పై మరల దండెత్తివచ్చి పృథ్వీరాజ్‌ను బంధిస్తాడు 17 సార్లు క్షమాభిక్ష పెట్టాడనే విశ్వాసంకూడా లేకుండా, పృథ్వీరాజ్ రెండు కండ్లనూ 'గోరీ' నిర్దాక్షిణ్యంగా ఊడబెరికిస్తాడు ఈ ఉదంతంనుండి మనం ఒక నీతిని నేర్చుకోవాలి అదేమనగా విశ్వాసఘాతకునికి, క్రూరునికి, కృతఘ్నునికి ఉపకారం చెయడం పాముకు పాలు పోసినట్లే అవుతుంది కనుక ప్రతి ఒక్కరూ వివేకంతో, విజ్ఞతతో పరోపకార బుద్ధిని ప్రదర్శించడం నేర్చుకోవాలి ఇది విస్మరించరాని నగ్నసత్యం

ఇక వుంటా

ఇట్లు
మీ 'నాన్న'

శ్రీవాణి

# సంఘ సంస్కర్త బసవేశ్వరుడు

జానమద్ది హనుమచ్ఛాస్త్రి

పన్నెండవ శతాబ్ది మధ్యకాలంలో ధార్మిక తాత్త్విక రంగాలలో బాహ్యాడంబరాలు విజృంభించాయి విశుద్ధ ధర్మం అస్పష్టమై, అంతశ్శుద్ధి కనుమరుగై, ప్రజలు అయోమయ స్థితిలో కొట్టుమిట్టాడే తరుణంలో అవతరించి ప్రజలలో ముఖ్యముగ కర్నాటకములో ప్రజాధర్మాన్ని ప్రబోధించి నిర్మలమగు తన జీవితం ద్వారా మార్గనిర్దేశం గావించి, సామాన్య జనానికి అనువైన భాషలో జ్ఞానామృతమును పంచిపెట్టిన మహాపురుషుడు బసవేశ్వరుడు

బుద్ధుని కారుణ్యము మహావీరుని సరళజీవనము, క్రీస్తు దయాగుణము, మహమ్మదు ప్రవక్తలోని నిర్భీతి, గాంధీజీలోని అహింసా పూర్వక సత్యనిష్ఠ మేళవించిన బసవేశ్వరుడు కర్నాటకలోని బీజాపుర జిల్లాలోని బాగేవాడి గ్రామంలో క్రీ శ 1132 లో జన్మించాడు మాదరస, మాదలాంబికలను బ్రాహ్మణ దంపతులకు జన్మించిన బసవయ్యకు బాహ్యాచారముల పట్ల అసహ్యభావము చిన్నతనముననే జనించింది ఆనాటి సమాజంలోని శివభక్తుల బాహ్యవేషములలోని దాంభిక ప్రవృత్తిని ఆడంబరాల్ని చూచి —

" పాయిలోని బూడిదను పూసుకొనకు
మెప్పునకు పూసుకొన్నట్లు అగును.
పూసికొని ఫలమేమి మనసున మంచి లేకున్న?
ఒకటికి పదిమాటలాడు డాంభికుల మెచ్చడు
కూడల సంగమ దేవుడు " అని

తీవ్రంగా విమర్శించాడు

బసవేశ్వరుని ఇష్టమైన కూడల సంగమ దేవుడు పేరుతో అనుభవ మంటపాధ్యక్షుడు ప్రభుదేవుడు (అల్లమ ప్రభు), గుహేశ్వరా యను మకుటంతోను వీరవిరాగిణిగా వినుతి కెక్కిన అక్కమహాదేవి శ్రీశైల మల్లేశ్వరుని ఆత్మనాయకునిగా వరించి " చెన్నమల్లికార్జున " యను మకుటంతోను రచించిన వచనములు మిక్కిలి ప్రసిద్ధములైనాయి

చిరుప్రాయంలోనే ఇల్లువదలి బసవేశ్వరుడు కృష్ణా-మల ప్రనదీ సంగమ స్థానమగు కూడల సంగమేశ్వర మను క్షేత్రమున జాతవేద స్వామి సన్నిధిలో విద్యాభ్యాసం సాగించాడు సంగమేశ్వరుని ఆదేశము మేరకు బసవన కళ్యాణ చాళుక్యుల రాజధాని యైన కళ్యాణపట్టణము చేరుకున్నాడు క్రీ శ 1150 లో కళ్యాణమును ఏలిన రాజులలో ముఖ్యుడు బిజ్జలుడు ఈ బిజ్జలుని ఆస్థానములో బసవన వ్రాయసకాడుగా ప్రవేశించి తుదకతని ముఖ్య సచివుడైనాడు

బసవన దక్షతను నియమనిష్ఠలను చూచి గిట్టని కొందరు అదే పనిగా బిజ్జలునిపై కొండెములు చెప్ప సాగిరి వాటిని ఏమాత్రము లక్ష్యింపక బసవన ప్రజాహితముకై నిరంతరం శ్రమించాడు రాజకీయ రంగమున రాణించిన బసవేశ్వరుడు తన కత్యంత ప్రీతికరమైన ధార్మిక రంగమున కృషి కొనసాగించాడు సద్భక్తి సదాచార ప్రాతిపదికగా శివశరణుల సంఘం ఒకటి యేర్పడింది బసవన నేతృత్వంలో అదియె కాల క్రమంలో " అనుభవ మంటపము " అను పేరుతో వర్ధిల్లింది లౌకిక జీవనముతోపాటు ఆధ్యాత్మిక తత్త్వమును మేళవించి అస్పృశ్యతా నివారణ, మహిళోద్ధరణ మున్నగు విచారముల కనుగుణంగా నూతన సమాజనిర్మాణం జరగాలని బసవేశ్వరుడు ప్రతిపాదించాడు

"కాయకవే కైలాస" ( కృషియే దైవం ) అను వీర మంత్రముతో ప్రజలు సదా కర్తవ్యోన్ముఖులు కావాలని బసవన ప్రబోధించాడు వర్ణ వరాంతరసించిన బసవేశ్వరుడు —

సెట్టియనవచ్చునే సిరియాలుని
చాకలియనబోలునే మాచయ్యను
చండాలుడన దగునె కక్కయ్యను
మేదరియన నేనె చెన్నయ్యను!
నన్ను బ్రాహ్మణుడనగా కూడల
సంగయ్య నవ్వునయ్యా!"

అని వర్ణభేదాలను నిరసించాడు బసవేశ్వరుడు నెలకొల్పిన అనుభవ మంటపమున ప్రభుదేవ, చెన్న బసవేశ్వర అను మహానుభావులతో బాటు, కక్కయ్య, హరళయ్య, శ్వపచయ్య అను అంత్యజులు కూడా సభ్యులుగా వుండి విశ్వధర్మమగు వీరశైవమత ధర్మమును ప్రచారం చేశారు

అర్థరహితమగు హింసను బోధించు యజ్ఞయాగ వ్యవస్థను ప్రాణబలిని అతడు ఖండించాడు బసవేశ్వరుని ధర్మము కు మానవతయే మూలాధారము—

" దయలేని ధర్మమేదయ్యా
దయయే ఎల్లయా సకల ప్రాణులకు
దయయే ధర్మపు మూలమయ్యా
కూడలసంగనుయ్యలట్టుగాని వొల్లదయ్యా"

అని అనుటయే గాక ,

చంపువాడే మాదిగ, మాలిన్యమును
తినువాడే మాల, కులమేమో
వారి కుల ధర్మంబేదో ?
సకల జీవాత్మలకు మంచి నపేక్షించు
మన కూడల సంగని శరణులే కులజులు.

అని కులవ్యవస్థను నిరసించాడు

మోక్షసాధన మార్గమున స్త్రీ పురుష వివక్షణ అర్థరహితమని చాటిన బసవన, అనుభవ మంటపములో అక్కమహాదేవి, సత్యక్క రేచవ్వ, లింగమ్మ, నీలాంబిక కూడా పాల్గొనేవారు

ఏ పేరుతో పిలిచినా దేవుడొక్కడే "ఏకం సత్ విప్రా బహుధా వదంతి" అన్న ఉపనిషద్వాక్యసారం బసవేశ్వరుని వచనామృతమున పొడసూపింది సత్య సదాచారములకు అత్యంత ప్రాధాన్యత నిచ్చిన బసవేశ్వరుడు — " దేవలోక మర్త్యలోకములు వెరుగా లేవు సత్యము పలుకుటయే దేవలోకము, అసత్య మాడుటయే మర్త్యలోకము— ఆచారమే స్వర్గము అనాచారమే నరకము అయ్యా! అనుటే స్వర్గము ఏరా! అనుటే నరకము " అని సరళాతి సరళమగు రీతిలో ప్రవచించారు

ఆనాటి నాగరికతాస్థితి, పూజావిధిని చూచి బసవేశ్వరుడు వేసిన ప్రశ్న నేటికీ వర్తిస్తుంది

రాతి నాగులకు పాలు పోసెదరు
బ్రతికిన నాగును చంపుమనెదరు
తినెడు జంగము వచ్చిన పొమ్మనెదరు
తినని లింగమునకు నైవేద్యము పెట్టెదరు

అని ఆనాటి మూఢనమ్మకాలను ఖండించాడు జీవన తత్త్వము, ఆధ్యాత్మికతత్త్వము, సాహిత్యరసికత్వము ముప్పిరిగొని మూర్తీభవించిన సారము అతని వచనములలో పరిప్లావితమైనది స్వధర్మము, సమాజధర్మము, మానవధర్మమును అతి సరళమైన భాషలో ప్రజల కందించిన మహాపురుషుడు బసవేశ్వరుడు

బసవని అతి నిరాడంబరుడు నా కంటే చిన్నవారు లేరు శివభక్తుల కంటే పెద్దవారు లేరు నీ పాద సాక్షిగ నా మది సాక్షిగా — కూడల సంగమదేవా నాకిదే దివ్యము అంటూ వినయ భాండారి అనిపించుకున్నాడు

బసవన కన్నడమున "షట్ స్థలవచన, శిఖారత్న వచన, కాలజ్ఞాన వచన, మంత్రగోప్య" అను నాలుగు గ్రంథములను రచించినాడు విశ్వజనీనమగు మతమును స్థాపించి ప్రచారమొనర్చిన బసవన 1168లో శివైక్యము చెందాడు ( )

# జరాసంధుడు

మల్లాప్రగడ శ్రీరంగారావు

బృహద్రధుడనే మహారాజు మగధదేశాన్ని పాలిస్తున్నాడు అతనికి చాలా కాలము సంతానంకలుగ లేదు ఏకాంతముగ నిర్జన ప్రదేశంలో తపస్సుచేసుకుంటున్న చండకౌశికుడనే మునిని సమీపించి నమస్కరించి, తనకు సంతానం కలిగే ఉపాయం చెప్పండని ప్రార్థించాడు ఆ సమయంలో ఒక చెట్టు నుండి రాలి క్రింద పడిన పండును తీసుకొని ఆ ముని మంత్రముతో ఆ పండును అభిమంత్రం చేసి ఆ బృహద్రధునికిచ్చి నీభార్యకీ ఫలమునిచ్చి తినిపించినచో సంతానం కలుగుతుందని చెప్పెను

అతనికిద్దరు భార్యలున్నందున ఆ పండును రెండు ముక్కలుగా కోసి యిద్దరికిచ్చెను వారిద్దరు ఆ పండును తిన్నందున వారికి కలిగిన శిశువులు కూడా సగం ముక్కలుగా వున్న శరీరంతో పుట్టారు ఒక కన్ను, ఒక కాలు, ఒక చెయ్యి, సగం కడుపు, సగం తలతో పుట్టిన ఆ యిద్దరి శిశువుల ముక్కలను చూచి ఆ భార్యలు భయపడి ఆ వికృత స్వరూపాలను తమ భర్తకుచూపించలేక అర్ధరాత్రి వీధిలో పారవేయించిరి ఆ పట్టణ ప్రాంతమున తిరుగుచున్న 'జర' యను రాక్షసి ఆ శిశు ఖండాలను చూచి తనకాహారం లభించిందని సంతోషించి తినుటకై వారిద్దరిని దగ్గరకు తీసుకొనగానే ఆ రెండు శరీరములు కలుసుకొని దృఢమైన శరీరముగా ఏకంకాగా ఆ బాలుడు ఏడవ సాగెను ఆ బాలుని శరీరమును మోయలేక ఏడ్చుచున్న ఆ బాలుని వదలిపెట్టి ఆ రాక్షసి పారిపోయెను ఆ పట్టణం లోని కొందరు స్త్రీలు, ఆ పసివానిని బలవంతంగా ఎత్తుకొనివచ్చి ఆ బృహద్రధుడనే రాజుకిచ్చిరి అపుడు 'జర' యను రాక్షసి మనుష్యస్త్రీ రూపమును ధరించి రాజు వద్దకు వచ్చి జరిగినవృత్తాంతమంతా చెప్పి ఇతడు మహాబలవంతుడు యితనిని నీ కుమారునిగా ఏలుకొనుమని చెప్పిపోయెను "జర" యను రాక్షసి చేత సంధింపబడినందున అతనికి 'జరాసంధుడు' అని పేరు వచ్చెను పెద్దవాడైన పిమ్మట ఇతనికి రాజ్యమిచ్చి తండ్రి తపస్సుకు పోయెను

ఈ జరాసంధుడు తపస్సు చేసి పరాక్రమవంతుడై ఆయుధములచే మరణము లేని వరాన్ని సంపాదించాడు అస్తి, ప్రాప్తి అనే కుమార్తెలను కంసునికిచ్చి పెండ్లి చేసాడు తన అల్లుడైన కంసుని చంపిన శ్రీకృష్ణునిపై వైరంపెంచుకొని చాలా పర్యాయాలు కృష్ణుని ఓడించెను చివరకు భీముని చేతిలో మరణించెను పంచకీచకులలో జరాసంధుడొకడని భారతము తెల్పుచున్నది ○




* దేహమనేది మాంసమయం మనస్సు మీమాంసామయం దేహం సందేహాలమయం వీటి నివృత్తికి మహాత్ములే శరణ్యం
* స్థూలశరీరంనుండి సూక్ష్మశరీరం విడిపోవటమే మరణం స్థూలశరీరం బల్బు అయితే సూక్ష్మ శరీరం ఫిలమెంటు చైతన్యం విద్యుత్తు
* కామానికి లొంగే పురుషునికన్నా ధర్మానికి లొంగే పురుషుడే మిన్న, అందుకే భార్యను 'ధర్మపత్ని' అంటారు 'కామపత్ని' అని అనరు

వేసవి తరగతుల ప్రసంగం.

# మనదంతా ఒకే జా

" సూక్ష్మమైనట్టి అణువున సూక్ష్మమగుచు
మేటి వస్తువులందున మేటి యగుచు
అంతటను సర్వసాక్షియై అలరునట్టి
బ్రహ్మయే ప్రకృతి ప్రకృతియే బ్రహ్మయగును"

చరిత్రకు పూర్వము దివ్యజ్ఞాన సంపన్నులయిన మహర్షులు, దైవమునుండి ఆవిర్భవించినటువంటి వేదవాణిని, శ్రద్ధగా పరిశీలించి, పరిశోధన సలిపి, అందలి సత్యసూక్తములను ఈ జగత్తుకు ప్రచార ప్రబోధలు సలుపుతూ వచ్చారు. ప్రపంచమున వున్నవి రెండే వస్తువులు 1 పదార్థము 2. పరార్థము కాని పదమునకు అర్థములను ప్రబోధించి, జగత్తులో వ్యాప్తి గావించి, ఏకత్వములోని అనేకత్వమును నిరూపణచేసి, చాటినటువంటిది పాణినీ గ్రాణ సంబంధం పదార్థముయొక్క స్వరూపమునే అంతరార్థముగా విశ్వసించి, ఆ పదార్థ స్వరూప జ్ఞానమును, లోకమునకు ప్రబోధ ప్రచారము చేసినటువంటి మహనీయుడు కాణాది ఈ కాణాదియొక్క దర్శనమే వైశేషిక ఈ వైశేషిక దర్శమునకు కాణాదే మూలకారణం పదార్థ విజ్ఞానమును ప్రపంచమునకు చాటి, పదార్థము అశాశ్వతమైనదనియూ, పరార్థము శాశ్వతమైనదనియూ జగత్తునకు నిరూపించటానికి యీ వైశేషిక దర్శనమును అనుభవిస్తూ వచ్చారు. ఈ ప్రపంచమునందు గల సమస్త విద్యలూ వేదమునుండి ఆవిర్భవించినటువంటివే ఈ సర్వ విద్యలూ భౌతికమైన జగత్తులో అనుభవింపజేసేటటువంటివి కాని ఆనాటి మహర్షులు, యీ భౌతికమైన, లౌకికమైన, క్షణికమైన విద్యలను త్యజించి, అలౌకికమైన, అభౌతికమైన దివ్యతత్త్వము నిమిత్తమై తమ జీవితాన్ని అంకితం చేశారు తపఃశక్తి చేత అభౌతికమైన సత్యములను హస్తగతము గావించుకున్నవారు ఆనాటి మహనీయులు పదార్థజ్ఞానములో పరిశీలన సలిపినప్పుడు, ఈ భిన్నరూపాన్ని మాత్రమే మనకు గోచరింపజేస్తాయి అంతర్ ప్రభావమునందు దీనిని పరిశీలన చేసినప్పుడు అన్నిటియందు ఉన్నటువంటి దివ్యత్వం ఒక్కటేనని స్పష్టమవుతుంది.

ఓ మానవుడా ! అందరం ఒక్క గూటి గు అందరం ఒక్క తీగ పువ్వులమే. అందరం ఒక్క ఎందుకు ఈ భేదములు ? ఎందుకు ఈ ద్వేషము పరులను కాదు నాయనా ! అల్పభేదములను పెంచ అనేకత్వముగా మార్చుకోవటం చేతనే సమాజం కనుక అనేకత్వంలోని ఏకత్వాన్ని మనం తీసుకోవ జాతి.

కొండలన్నీ బండలే భూమియంతయూ మృణ్మయమే, వృక్షములన్నీ కాష్టమయమే, మానవులందరూ మాంసమయమే ఆకారములో, రూపనామములో, వస్తువుయొక్క విశిష్టతలో, వివిధమైనటువంటి స్వరూప స్వభావములను నిరూపించవచ్చు. అంతరార్థమును పరిశీలన జరిపినప్పుడు, అన్నింటియందు ఉండినటువంటివి పంచభూతములే ఈ పంచభూతములయొక్క వికార స్వరూపములే ఈ వృక్షములు ఈ కొండలు, యీ భూమి, యీ మనుష్య స్వరూపములు— సమస్త ప్రాణికోటి పంచభూతముల అంతరార్థములే యీ భేదములు భౌతికమైన దృష్టిభేదములేగాని, అలౌకిక

# తి - అదే మానవజాతి

—భగవాన్ సాయి దివ్యప్రబోధ

మైన ఆత్మభేదములు కావని యీ వైశేషిక సూత్రము ప్రబోధిస్తూవచ్చింది ఒక అణువునకు మరొక అణువునకు బేదము నిరూపింపజేసినటువంటి దానికే ఒక విధమయిన విశేషమున్నది విశేషమును నిరూపింపజేసినటువంటిదే వైశేషికము అని పేరు వచ్చినది విశేషమనగా ఒక విధమైనటువంటి అంతర్భావము, సమస్త పదార్థములయందు, విశిష్ఠమైన ఆధారభూతములు

---

వ్వాలమే అందరమూ ఒక్క మాత బిడ్డలమే
జాతి పౌరులమే అందరమూ మానవులమే
లు? నిన్ను నీవు ద్వేషించుకుంటున్నావేగాని
సీ ఆత్మతత్వాన్ని, విస్మరించి, ఏకత్వమును
ఇంతటి దురవస్థలకు గురి అవుతూ వచ్చింది
గాలి. మనమంతా ఒకే జాతి. అదే మానవ

— బాబా

---

ఆధారము చేసుకొని, ఇటువంటి విశేషములను నిరూపింపజేసినటువంటివే వైశేషికము

ప్రపంచమంతయూకూడనూ అణుమయమే ఒక అణువునకును మరొక అణువునకును ఎంతయో భేదము కనిపిస్తుంది ఈ ప్రపంచము సత్యస్వరూపమనికూడా నిరూపించుతూ వచ్చింది వైశేషిక దర్శనము, ప్రకృతి, పదార్థముకూడనూ సత్యమేయని నిరూపించింది స్వరూపములు మారినప్పటికినీ, పదార్థము మారదు అని నిరూపిస్తూ వచ్చింది మట్టితో కుమ్మరి కుండలు చేశాడు కుండలు పగిలిపోయినాయి, ముక్కలు అయినాయి మరల మట్టిగా మారినాయి కుండలు మారినాయేగాని, ముక్కలు మారినాయెగాని మట్టి మారలేదు ఆ పదార్థము సత్యమేనని నిరూపించింది ఆ వైశేషికము ఇది వెండి టంబ్లర్ ఈ వెండి టంబ్లర్‌ను కరిగించి, వెండి గిన్నెగా మార్చుకోవచ్చును ఈ విధంగా ఆకారములు ఎన్ని మారినప్పటికినీ, వెండి మారలేదు గదా! కనుక పదార్థము కూడనూ ఈ జగత్తులో సత్యమేనని నిరూపించి పరిబోధించి, ప్రచారము సలిపినటువంటిదే ఈ వైశేషికము

పంచభూతముల తత్త్వము కూడనూ ఏనాడునూ మారునది కాదు పంచభూతములు భగవదంశములు శబ్దములయందు వివిధములైన శబ్దములు వుండవచ్చును ఆధారశబ్దము మాత్రం ఏనాడునూ మారనది కాదు ఒక హాల్‌లో హార్మోనియం వాయిస్తూ వుండవచ్చును ఈ హార్మోనియమునకు గాలి వీస్తుండాలి గాలి ఒక్కటే రీల్సు నొక్కినప్పుడు స-రి-గ-మ-ప-ద-ని-స సప్తస్వరములు వస్తుంటాయి ఈ సప్తస్వరములు మారవచ్చును కాని గాలి మాత్రము మారదు ఈ సప్త స్వరములకూ గాలి ఒక్కటే ఆధారము ఆ గాలియే "ఓం" కారము ఈ స్వరములే వికారములు ఇన్ని వికారములు ఒక్క "ఓం" కారము నుండియే ఆవిర్భవించినవని, పదార్థము మారినా పదార్థము మారదని, ఈ జగత్తునందు పదార్థము, ప్రకృతి శాశ్వతమైనటువంటివని నిరూపిస్తూ వచ్చింది ఈ వైశేషికము దీనికి కొన్ని ఆధారములు కూడనూ తీసుకొన్నవి ఈ ఆధారములు కూడనూ ప్రాకృతమైనటువంటి ఆధారములుగానే తీసుకొన్నవి. లోకములో స్త్రీలూ, పురుషులూ వున్నారు ఈ ఇరువురిలో లింగభేదములుండవచ్చునుగాని, వీరిలో హెచ్చుతగ్గులు లేవని

ఖండిస్తూ వచ్చింది వైశేషికము పురుషుల అధికమని, స్త్రీలు తక్కువని ఈనాడు ప్రాకృతమైన దృష్టితో చూస్తూ వస్తున్నారు కానీ వైశేషికము ఈ ఇరువురూ సమానమేనని చెప్పింది పురుష సహకారమే లేకుండిన స్త్రీ ఎట్టి కార్యమును సాధించలేదని అదే విధముగనే స్త్రీ సహకారము లేకుండిన పురుషుడు కూడను ఎట్టి కార్యమును సాధించలేడని నిరూపిస్తూ వచ్చింది అనేక ప్రమాణములచేత ఈనాడు సమాజం ఈ విధమైన దురవస్థలకు గురి కావటానికి కారణమేమిటి? అల్ప భేదములను పెంచుకొని, ఆత్మతత్వాన్ని విస్మరించి, ఏకత్వమును అనేకత్వముగా మార్చుకోవటం చేతనే సమాజం ఇంతటి దురవస్థలకు గురి అవుతూ వచ్చింది

మానవునికి శాంతి లేకపోవటానికి కారణమేమిటి? సమాజము నుండి శాంతి సుఖములు కావాలని ఆశిస్తున్నాడు మానవుడు కాని ప్రతి మానవుడు నేను ఈ సమాజమునకు చేసినదేమిటి? అని తనకు తాను ప్రశ్న వేసుకుంటే ఏ మాత్రం జవాబు చిక్కటంలేదు సమాజానికి ప్రపంచానికి ఏదైనా మంచి చేస్తే కదా! సమాజం గాని ప్రపంచంగాని నీకు మంచి చేయటానికి ప్రపంచశాంతికి నీవు పాటుపడినప్పుడే నీకు శాంతి లభిస్తుంది ప్రపంచమునుండి నీవు అనుభవించే సుఖదుఃఖములన్నీ నీయొక్క భావముల ప్రతిబింబములేనని ఈ వైశేషికము చక్కగా వివరిస్తున్నది ఇవియే అంతర్ విశేషములు ఈ విశేషములను పురస్కరించుకొనియే దీనికి "వైశేషికము" అని పేరు వచ్చింది ప్రపంచం నాకు ఏ సుఖమును అందిస్తున్నది? అని ప్రశ్నించుకుంటున్నావేగాని ప్రపంచానికి నేను ఏ సుఖమును అందించాను? అని ప్రశ్న వేసుకోవటం లేదు ప్రపంచం నాకు ఏ మేలు చేసింది? అని ఆశిస్తున్నావే గాని, ప్రపంచానికి నేను ఏమి మేలు చేశాను? అని ప్రశ్నించుకోవటంలేదు కనుకనే వైశేషికము ఇలాంటి ప్రశ్నలన్నీ జగత్తునందుండి అనేక సమాధానములు పొంది, ఆ సమాధానములు ఈ జగత్తు తిరిగి ప్రచార ప్రబోధలు చేస్తున్నది కనుక మనం చేసేటటువంటి కర్మలు ఉత్తమమైనటువంటివిగాను, మానవత్వమునకు సంబంధించినటువంటివిగాను విచారించి మనం చేయాలి

పరమాణువునందు మహత్తరమైన శక్తి ఉంటున్నది ఈ భేదములను మనం పురస్కరించుకొని చేయటం లోపల వుండినటువంటి అంతరార్థమును గుర్తించాలి ఇంతియే కాదు ఈ వేదములు భూత భవిష్యత్తు వర్తమానకాలములకు సత్యస్వరూపాన్ని నిరూపించేటటువంటి యొక్క దివ్యజ్యోతులను కూడా ఈ వైశేషికము అందిస్తూ వచ్చింది త్రికాలబాధ్యమైనదే సత్యమైనదని నిరూపిస్తూ వచ్చింది కనుక ఈ త్రికాల బాధ్యమునందు ఈ విధమైన భేదములు ఎందుకు? దీనినే శుక్ల, యజుర్వేదములలోపలకూడనూ చక్కటి ఆదర్శములను అందించేటటువంటి అనుభూతులు అందిస్తూ వచ్చాయి ఈ వేదములయొక్క సూత్రములను, ఈ వైశేషికము చక్కగా పరిశీలన సలిపి "ఓ మానవుడా! అందరం ఒక్క గూటి గువ్వలమే. అందరమూ ఒక్క మాత బిడ్డలమే! అందరం ఒక్క తీగ పువ్వులమే అందరం ఒక్క జాతి పౌరులమే అందరమూ మానవులమే ఎందుకు ఈ భేదములు? ఎందుకు ఈ ద్వేషములు? నిన్ను నీవు ద్వేషించుకుంటున్నావేగాని ఒరులను కాదు నాయనా!" అని ప్రబోధించింది ఒక్క గూటి గువ్వలమే ఏమిటా గూడు? దేహమనే గూడు అందరికీ వుంటుండాలి ఆ గూటిలోవున్న గువ్వలే యీ జీవుడు అందుకోసమనే పూర్వకాలమున పాడేటటువంటివారు "పలుకవే బంగారు చిలకా!" అని ఆ చిలుకను యీ దేహమనే పంజరములోపెట్టి పెంచుతున్నారని కనుక యీ దేహమే ఒకవిధమైన పంజరము అనేక పర్యాయములు చెప్పాను ఈ దేహమనేటటువంటిది పాంచభౌతికము ఇందులో క్షణక్షణమునకు "నీచులూరునుగానె పునుగు జవ్వాజీలు పట్టబోవు" ఇలాంటి గూడునందు ఎంతవరకు వుంటుంది

యీ పిట్ట? రెక్కలు వచ్చేంతవరకు మాత్రమే వుంటుంది అదేవిధముగ మనకు ఆత్మజ్ఞానం వచ్చేంత వరకు మాత్రమే యీ గూడును ఆధారం చేసుకుంటున్నాం ఈ ఆత్మజ్ఞానం అనేటటువంటి రెక్కలు రాగానే, వైరాగ్యము పూని దీనిని (దేహమును) విసర్జించుకుంటున్నాం కనుకనే యీ దేహమే ఒం గూడు ఈ దేహమనే గూడు వివిధ రూ[illegible] వుండినప్పటికీ అన్నియూ గూడే కనుక అనేక [illegible] లోని ఏకత్వాన్ని మనం తీసుకోవాలి గూడుయొ[illegible] గువ్వలమే మనం ఒక్క తల్లి పిల్లలమే ఎ[illegible] తల్లి? భూమాత ప్రతి మానవుడు భూమిను [illegible] ఆవిర్భవించినటువంటివాడే ప్రతి దేహమూ మట్టిమయమే పుట్టినటువంటి బిడ్డలకు చక్కగా స్నానం చేయించి, ఉయ్యాలలో పడుకోపెట్టినప్పటికినీ, సాయంకాలం అయ్యేటప్పటికి, ఆ దేహంమీద మట్టి ఉంటుంది ఈ దేహం ఏ మట్టిని ముట్టింది? కాదు దేహమే మట్టిమయం మట్టినుంచి వచ్చిన యీ దేహం మట్టిలోనె లీనమైపోతున్నాది రాజు మొదలు కూటిపేద వరకు మట్టినుండి వచ్చినటువంటివారే లోకములో లోహములు ఎన్నియో వుంటున్నాయి అన్ని లోహములూ మట్టినుండి వచ్చినటువంటివే కాని వీటి విలువలు మాత్రం వివిధ రూపములలో అందిస్తున్నాం మాణిక్యం కూడా మట్టినుండే పుట్టినది కాని, చెట్టునుండి కాయలేదు ఈ సత్యమును చక్కగా గుర్తించుకుంటే అందరమూ ఒక్క తల్లి పిల్లలమే ఓ మానవుడా! ఒక్క తీగ పూవులమే ఆ తీగయే హృదయము ఈ హృదయము అందరియందు వుంటున్నది ఒక హృదయమునుండి మరొక హృదయానికి సంబంధం వుంటుండాలి హృదయముకు, హృదయముకు సంబంధం వుండినటువంటి మనోపుష్పమే యీ పుష్పములు ఒక్క తీగె నుండి పుట్టినటువంటి పువ్వులమే ఒక జాతినుండి పుట్టినటువంటి పౌరులమే మనదంతా ఒకే జాతి అదే మానవజాతి ఎట్టివాడైనా తాను పశుజాతి వాడనని అనుకుంటాడా? లేక పక్షిజాతి అనుకుంటాడా?

## సత్యావీక్షణం

కైవల్య కళ్యాణ కాంతిరేఖను జూపి
మనుజ సంతతిం బ్రోచు మహితమూర్తి
కష్టగాఢ్ల సుడులలోంబడి ప్రక్క విలపించు
దీనుల [illegible]న్నించు దివ్యమూర్తి
విశ్వవిజ్ఞ[illegible]ంబు [illegible] బోధిన
సా[illegible]ంబు నందించు జ్ఞానమూర్తి
రుజల వాతను జిక్కి రోదించు రోగుల
ప్రేమతో లాలించు విమలమూర్తి
సత్యసాయి యొకడె సర్వవసుంధరా
నిలయమందు ప్రేమ నిలయమందు
చదువుడయ్యావాని సచ్చారితము నేడు
పాడుడయ్యావాని భావనములు

— తాళ్ళూరి సత్యనారాయణ

నేను మానవజాతివాడనని మాత్రమే అనుకుంటాడు కనుక మానవజాతిలో పుట్టినటువంటి వివిధ రూపములే సముద్రములో పుట్టినటువంటి వివిధ అలలవలె, యీ సచ్చిదానందం అనే దివ్యత్వమునుండి వివిధ రూపములనే అలలు పుడుతున్నాయి కనుక మనకెందుకు యీ ద్వేషం? ద్వేషం నిర్మూలనం గావించినటువంటిది, భేదములు నిర్మూలనం గావించినటువంటిది, ఏకత్వాన్ని ప్రకటించి, దివ్యత్వాన్ని ఆనందముగా అందించినటువంటిది యీ వైశేషికమే ఇదియే ఇందులో వుండినటువంటి పెద్ద విశేషం అనేకమంది వైశేషిక ధర్మమును గురించి ప్రబోధిస్తుంటారు కాని గ్రంథ పరిచయంతో మాత్రమే అందిస్తున్నారుగాని, నిత్య సత్యమైనటువంటి, అనుభూతిలోనున్న విషయాలను అందించి ప్రజలయొక్క హృదయాలకు హత్తుకునేట్లుగా, ఆనందపరచేట్లుగా ప్రబోధించేటటువంటి వ్యక్తులు యీనాడు కరువైపోయినాయి ఆనాటి నిధిజ్ఞానసంపన్న

లయిన మహర్షులందరునూ, యీ భౌతిక లౌకికమునకు అతీతమైన స్థితిని పొందారు వారంతా Super Mindలో ప్రవేశించారు ఆ Super Mind నుండి చూచినప్పుడు ఇవన్నీ అల్పశక్తులుగానే కనిపిస్తుంటాయి ఈనాడు మనం నేర్చిన సర్వవిద్యలూ అల్పవిద్యలే, అసత్య విద్యలే, అప్రమాణమైనటువంటి విద్యలే ప్రమాణాలు లేవు యిక్కడ ఏమిటి దీనికి ప్రమాణము ? ఇష్టము వచ్చినట్లు పడిపోవటమే దీనికి ప్రమాణం కనుక ప్రమాణమనేటటువంటి దానిని నిరూపించినటువంటి యొక్క విశిష్టత లేనటువంటిది కనుకనే— ఈ ప్రకృతి యంతయూ అప్రమాణ స్వరూపములే అయిపోయి నాయి ఏ భాషలో చూచినప్పటికినీ, సత్యముయొక్క అర్థములు అనేకంగా రూపొందుతూ వచ్చినాయి పదములయొక్క స్వరూపములుకూడా అనేకముగా సృష్టికటిస్తూవచ్చాయి

ఈనాటి విద్యార్థులకు అర్థమయ్యే రీతిలో చెప్పవలసి వచ్చినప్పుడు 'PUT' 'పుట్' అంటారు ఈ పదమును కాని BUT 'బట్' అంటారు దీనిని ఎందుకు 'బుట్' అనకూడదు ? దీనికి ఏ ప్రమాణం ? Walk 'వాక్' అంటారు 'వాల్క్' అని ఎందుకు అనరు ? కనుకనే పదములయొక్క అర్థములను ప్రమాణములేనటువంటి స్థితిలో ప్రబోధించడంచేతనే మానవుని యొక్క పరితత్త్వమనేటటువంటిది కూడనూ పరమార్థమార్గానికి పోలేకపోతున్నాది, పదార్థమును గురించినటువంటిది శబ్దమును గురించి బోధించినటు వంటిది వైశేషిక గ్రంథం కనుక యీ విధమయిన భేదములను మనం చక్కగా విచారణ చేయాలి ప్రపంచమునందు అనేక విషయములను మనం చూస్తు న్నాం కొన్ని మంచివిగా, మరికొన్ని చెడ్డవిగా మనం భావిస్తున్నాం ఈ మంచిచెడ్డలు కాలమార్పుచేత సంభవించినటువంటివే అంతేగాని చెడ్డ అనేది ఈ జగత్తులో లేనేలేదు అయితే 'నేను మానవుడను' అనే దేహభ్రాంతి వుండినంతవరకు ఈ మంచిచెడ్డలను మనం పాటించాలి ఈనాటి మానవుడు వివేకహీనుడు కావటంచేతనే, వైరాగ్యము భారమైపోతున్నాది. కేవలం ఆత్మజ్ఞానం లేకపోవటం చేతనే శరీరము భారమవుతున్నాది ప్రేమతత్త్వము లేకపోవటం చేతనే మనస్సు భారమవుతున్నాది మనోభారమునకు కారణము విశాలమైన ప్రేమతత్త్వము లేకపోవటమే శరీరభారమునకు కారణము ఆత్మవిచారణ లేకపోవ టమే వైరాగ్యము లేపోవటానికి కారణము వివేక జ్ఞానములు లేకపోవటమే కనుక ప్రతి మానవునికి ఈ విచారణ (Discrimination) అత్యవసరం ఏది సత్యం ? ఏది అసత్యం ? ఏది ఆధారము ? ఏది ఆధేయము ? — ఇక్కడ మనం కొన్ని విధములయిన ఆదర్శములను తీసుకోవాలి నిమిత్త కారణం, ఉపాదాన కారణం అని రెండు ఉంటున్నాయి మట్టిని, నీటిని భగవంతుడు సృష్టించాడు ఇది మూలాధారము ఈ రెండింటిని ఆధారం చేసుకొని కుమ్మరి కుండలు చేస్తున్నాడు ఈ కుమ్మరి కేవలం నిమిత్తమాత్రుడే మట్టి, నీరు లేకపోతే కుండలు ఏవిధంగా చేయగలడు ? కనుక మానవునియందు సర్వసృష్టికిగనూ ఆధార మైనటువంటి మూలాధారమే మూలాధారమును ఆధారము చేసుకొని నిమిత్తమైన కర్మలను మనం ఆచరిస్తున్నాం భగవంతుడు ప్రత్తిని పుట్టించాడు ఈ ప్రత్తిని మానవుడు పుట్టించలేదు ఈ ప్రత్తి బీజములను మానవుడు సృష్టించలేదు ఈ ప్రత్తినుండి నూలు తీసి, నూలుతో వస్త్రమునేసి, వివిధ దుస్తులుగా తయారుచేసుకొని ధరిస్తున్నాడు ఆధారము ఎవరు సృష్టించారు ? అదియే భగవత్‌శక్తి

ఈనాటి సైంటిస్టులు సముద్రపు ఉప్పునీరును తీపి నీరుగా మారుస్తామంటూ కోట్లాది రూపాయలు ఖర్చుచేస్తు న్నారు సముద్రపు నీరును తీపి నీరుగా మారుస్తామని ప్రచారం చేస్తున్నారు యాంత్రికశక్తితో విజ్ఞానశక్తి వలన ఉప్పునీరును కొంతవరకు మంచినీరుగా మారుస్తు న్నారు కాని దీనికి అయ్యే ఖర్చు ఎంత ? శ్రమ ఎంత ? నిజముగా ఉప్పునీరే లేకపోతే తీపి నీరుగా

ఎంతవరకు మార్చగలరు? అది అయినా తీయని నీరుగా మార్చగలుగుతున్నారా? కొంతవరకు మాత్రమే మార్చగలుగుతున్నారు ఒక టంబ్లర్ ఉప్పునీరును మంచినీరుగా మార్చాలంటే 40 నయాపైసలు ఖర్చు అవుతున్నది ఈ సైంటిస్టులు ఎంత ధనం దుర్వినియోగం చేస్తున్నారు భగవత్ విశ్వాసమంటే ఎందుకు మంచినీరు ప్రాప్తించదు? మనస్సునంతా ఉప్పునీరుగా మార్చుకొని, కేవలం బయట ఉప్పునీరును మంచి నీరుగా మార్చాలంటే ఇది సాధ్యమవుతుందా? మనం మార్చుకోవలసినది ఇదికాదు బయట తెల్లటి దుస్తులు, లోపల నల్లటి హృదయము మనం మార్చుకోవలసినది తెల్లటి హృదయంగా మార్చుకోవాలి ఇంకా కొంత మంది సైంటిస్టులు హైడ్రోజన్, ఆక్సిజన్ చేరిస్తే నీరు అవుతుందంటున్నారు నిజమే ఈ హైడ్రోజన్, ఆక్సిజన్ ఎక్కడనుంచి మీరు సంపాదించారు? అదియే భగవత్‌సృష్టి ఆధారమనేటటువంటి దానిని తీసుకొని కొన్ని ఆధేయాలు మీరు మార్చుకుంటున్నారు

ఈనాటి మానవుడు భగవంతుని దివ్యశక్తి అనేటటువంటి ఆధారమును విస్మరిస్తున్నాడు. కృతఘ్నుడు ఇన్ని పరికరములను ప్రపంచానికి అందించాడేనని భగవంతునికి కించిత్ అయినా కృతజ్ఞత చూపుతున్నామా? కేవలం కృతఘ్నతాబుద్ధితో వున్నాము జీవుడు ఒక కర్చీఫ్ క్రిందపడితే, ఎవరయినాయిస్తే Thanks Sir! అంటాం నీ కర్చీఫ్ నీకు అందించినందులకె Thanks చెబితే, భగవంతుడు తన శక్తి నంతా జీవులకు అందిస్తున్నప్పుడు నీవు ఎంత కృతజ్ఞత చూపించాలి? సమస్త సృష్టి యందున్నటువంటి సమస్త శక్తులుకూడనూ, ఆధారమైన శక్తులు గనుకనే —ఇది శాశ్వతము జీవుడు శాశ్వతము, పదార్థము శాశ్వతము ప్రకృతి శాశ్వతము కారణమేమిటి? మూడింటి యందు వుండి నటువంటి ముమ్మూర్తులైనటువంటి త్రిమూర్తి స్వరూపమే భగవంతుడు కనుకనే జీవ, ఈశ్వర, ప్రకృతి జీవేశ్వర ప్రకృతి కనుక దివ్యమైనటువంటి ఆధారమును ప్రబోధిస్తూ, ఆ ధేయమును ఆధారముగా తీసుకొని, జీవించమని ప్రబోధిస్తూ వచ్చింది ఈ వైశేషికము ప్రతి పదార్థమూ అణుమాత్రమే, అణుస్వరూపమే అయితే ఒక అణువు మరొక అణువు భిన్నంగానె ఉంటున్నాయి ఢిల్లీ నుంచి, మద్రాసునుంచి రేడియో తరంగాలు వస్తున్నాయి. అన్ని దేశములనుంచి యీ శబ్దతరంగములు వస్తున్నాయి అయితే ఒక్క తరంగములో మరొక తరంగం చేరటంలేదు ఏ తరంగానికి ఆ తరంగం ప్రత్యేకంగానే ఉంటున్నాయి కానీ అన్ని తరంగములూ మూటకట్టినట్లుగా వున్నాయి ఒకచోట కానీ అవి కలియటంలేదు ఏమాత్రం Confusion (తారుమారు) కావటంలేదు ఈ శక్తి ఎవరుయిచ్చారు? ఇది సామాన్యులకు ఎవరికీ సాధ్యంకాదు దైవచిత్రములు మహాచిత్రమైనటువంటివి పురందరదాసు చెప్పాడు "ఓ మానవుడా! భగవంతుడు చిలుకను సృష్టించాడు పచ్చనిరంగు ఎర్రని ముక్కుయిచ్చి ఎంత అందంగా సృష్టించాడు కుంచె తీసుకొని పెయింట్ చేసినా ఇంత అందంగా రాదే! నెమలిని ఎంత సుందరమైన రంగులతో సృష్టించాడు? ఎవరైనా యీవిధంగా రంగులు వేయగలరా? పెయింట్ వేస్తారే గాని పెయింట్‌గానే కనిపిస్తుంది గాని సహజంగా కనిపించదు కాని యింతటి సహజమైన స్వరూపాన్ని భగవంతుడు ఎట్లా సృష్టించాడు? ఈ విధంగా ఏ సైంటిస్టు అయినా సృష్టించగలడా? కాని అణువుతో అన్నీ సృష్టిస్తూనే ఉన్నారు కాని ఆ అణువుతోనే వారు అంత్యం అయిపోతున్నారు కాని యీ దివ్య సృష్టికి మాత్రం ఏ మాత్రం హానిలేదు ఏ యంత్రములను సైంటిస్టు సృష్టించాడో, ఆ యంత్రములను చూచి తానే భయపడిపోతున్నాడు కఠినమైనటువంటి, పాషాణ హృదయుడైనటువంటి 'చర్చిల్' కూడా ఒకనాడు చెప్పాడు "మానవుడు అన్నింటిని తెలుసుకుంటున్నాడు. కాని తనను తాను తెలుసు

కోవటంలేదు" అన్నాడు దీనినే ప్రహ్లాదుడుకూడా చెప్పాడు "లోకములన్నియున్ గడియలోన జయించినవాడవు తండ్రీ! ఇంద్రియాలోకము చిత్తమున్ గెలువ నేరవు" నీవు ధరించిన ఇంద్రియాలనే నీవు జయించలేకపోతున్నావు తెల్లవారి మొదలు రాత్రి వరకు యింద్రియాలను అనుభవిస్తూనే వున్నావు. ఇది నాది! ఇది నాది! అని అహంకరిస్తున్నావు కాని వాటిని జయించలేక ఇంద్రియములకు బానిస అయిపోయినావు నీవు దేనికి అధికారివి? నీవు అధికారివే కావు భౌతికమైన, లౌకికమైన యీ యింద్రియాలనే జయింపలేనటువంటివాడవు అంతర్ యింద్రియములను ఏ విధంగా సాధించగలవు? "లోని శత్రువులకు లొంగిపోయినవాడు, బయటి రిపులనెల్ల బట్టగలడు?" లోపలనే చిక్కుకొనిపోయినాడు వీడు బయట శత్రువులను ఎలా గెల్చుకుంటాడు? అసాధ్యము కనుకనే నీవు యీ భౌతికమైన, లౌకికమయిన విషయాలను సాధ్యమయినంతవరకు అదుపులో వుంచుకొని సరియైన మార్గములో ప్రవేశపెట్టాలి ఈవిధంగా అదుపులో పెట్టుకోలేకపోవటంచేతనే అనేక దుఃఖములకు, విచారములకు, కష్టములకు గురి అవుతున్నాడు మానవుడు ఈ కష్టములు దేనివలన వస్తున్నాయి? విచారణ చేసుకోవటంలేదు 'నా కర్మ'! 'నా ప్రాప్తి'! అని పోతున్నాడు ఇది కానేకాదు మానవప్రయత్నంచేత సాధించలేనటువంటిది లేనే లేదు గాలినయినా కట్టగట్టి హస్తములో పెట్టుకోవచ్చు ఆకాశమునయినా ముక్కలు ముక్కలు చేసి పారవేయవచ్చు సముద్రమును ఒక్కసారి త్రాగవచ్చు అగ్నినికూడనూ అరచేతిలో పట్టవచ్చు కాని తన మనస్సును మాత్రం తాను సాధించుకోలేకపోతున్నాడు ఈమనస్సును సాధించినటువంటివాడే నిజమైన మనిషి మనస్సును సాధించకుండా నేను మనిషిని,మనిషిని అని చెప్పుకోవటంవలన ప్రయోజనంలేదు. అతను కేవలం ఆకారమనిషే అవుతాడుగాని అసలైన మనిషి కాదు కనుకనే చాలామంది చెబుతుంటారు మ. ని. షి. దీనిని త్రిప్పి చదువుతే 'షినిమ' షినిమా మనిషిగా తయారవుతున్నావుగాని నిజమైన మనిషిగా తయారు కావటంలేదు నిజమైన మనిషిగా తయారుకావాలి నిజమైన మనిషి మనస్సుతో కూడినటువంటివాడు, ఆ మనస్సును అదుపులో నుంచుకొగలవాడు కనుక వైశేషికము ప్రకృతియొక్క సృష్టియొక్క రహస్యాలను అంతా కూడనూ చక్కగా విపులంగా చెబుతూ వచ్చింది

అణువుయొక్క మయమే ఈ ప్రపంచము అఖండమంతా అణువులోనే వున్నది చిన్న విత్తనములోనే వున్నది పెద్ద వృక్షము కాని విత్తనములో వృక్షము మనకు కనిపించదు వృక్షములోవున్న ఆకులు, కొమ్మలు, కాయలు, పండ్లు అన్నీ ఈ విత్తనములోనే ఉన్నాయి ఈ విత్తనములోనే లేకుండిన వృక్షములో ఏవిధంగా వస్తాయి? కనుకనే "బీజం మాం సర్వ భూతానాం" అన్నది గీత ఈ బీజంనుండియే విశ్వమనే వృక్షము ఆవిర్భవించింది. కనుక అణువునందే వుంటున్నది ఘనమైన దివ్యశక్తి ఈ ఘనమునందే ఉంటున్నది అణువైనశక్తి. ఇంత పెద్ద వృక్షమునందే ఒక చిన్న విత్తనం వుంటున్నది ఇంత చిన్న విత్తనమునందే ఇంత పెద్దవృక్షము వుంటున్నది ఇలాంటి పవిత్రమైన, సత్యమైన నిత్యమైన సూత్రులు ప్రబోధిస్తావచ్చాయి ఈ షడ్దర్శనములు

న్యాయం మానవునియొక్క ప్రాణంగా నిరూపిస్తూ వచ్చింది ప్రాణం వున్నటువంటి మానవుడు ప్రకృతిని గుర్తించమని చెప్పింది వైశేషికము ప్రాణాన్ని, ప్రపంచాన్ని ప్రబోధిస్తూవచ్చింది రేపటి దినము సాంఖ్యమును గురించి చెబుతాను సాంఖ్యము దేనిని గురించి బోధిస్తుందో రేపు వినవచ్చును

( బృందావన్‌లో జరిగిన వేసవి తరగతులలో ది 28-5-1993 న భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు చేసిన దివ్య ప్రసంగమునుండి )

వ్యక్తులూ – వ్యక్తిత్వాలు . 53

## సనాతన ధర్మ ప్రచారానికి జీవితం అంకితం చేసిన

# విద్యాశంకర భారతీస్వాములవారు

-కంచి వాసుదేవరావు

చాలా సంవత్సరాల క్రితం బందరు గొడుగుపేట లోని శంకర మఠాన్ని సందర్శించిన వారికి పచ్చని దబ్బపండు ఛాయతో – బ్రహ్మతేజస్సు ఉట్టిపడే వదనారవిందంతో ఒక స్వాములవారు దర్శనమిస్తూ వుండేవారు ఆయన గాయత్రీ పీఠాధిపతులు విద్యాశంకర భారతీస్వాములవారు. బందరు పట్టణ అదృష్ట మేమిటో కాని ఆంధ్ర దేశానికేకాక దక్షిణ భారత దేశానికే కీర్తి ప్రతిష్ఠలు చేకూర్చిన స్వామి వరేణ్యులు పీఠాధిపతులు ఇక్కడనుంచే అవతరించారు సంసార బంధములను తెంచుకున్న కె. పి. రామారావుగారు, చిట్టూరి రామకృష్ణారావుగారు దక్షిణ భారత దేశంలోని ప్రసిద్ధ కుర్తాళ పీఠాన్ని అధిష్టించి జ్ఞానజ్యోతులను ప్రకాశింపచేసిన సంగతి మనకు తెలుసు ప్రసిద్ధ వయొలిన్ విద్వాంసులు హరినాగభూషణంగారు, పారమార్థిక చింతనతో సన్యాసాశ్రమం స్వీకరించిన విషయం కూడ మనకు తెలుసు ఐతే సన్యాసాశ్రమం స్వీకరించిన బహు కొద్ది రోజులకే ఆయన శివ సాయుజ్యం పొందారు ఈ కోవకు చెందినవారే శ్రీ శ్రీ శ్రీ విద్యాశంకర భారతీస్వామివారు ఆయన సనాతన ధర్మఉద్ధరణ కోసం తన యావత్ జీవితాన్ని అంకితంచేసి రాష్ట్రవ్యాప్తంగా విస్తృత ధర్మప్రచార పర్యటనలు జరిపిన మహనీయుడు శంకర భగవత్పాదుల అంశ వీరిలో వుందని వారిని చూచిన ప్రతివారికీ నమ్మకం కలిగేది శంకర భగవత్పాదులు మాదిరే ఆర్ష ధర్మప్రచారం కోసం దేశపర్యటనలు జరిపారు ఆదిశంకరాచార్యులువారు దేశం నాలుగు దిక్కులా శంకరాచార్య పీఠాలను స్థాపిస్తే విద్యాశంకర భారతీ స్వామివారు బందరులోనేకాక కాకినాడ, అమలాపురం ముమ్మిడివరాలలో శంకర మఠాలను స్థాపించి గాయత్రి తదితర దేవతా విగ్రహాలను ప్రతిష్ఠించారు శంకరాచార్యులవారి భక్తపరమాణువుగా సంస్కృత భాషలో ఆదిశంకర భగవత్పాద చరిత్రము, విద్యారణ్య యతీంద్ర చరిత్రము, నృసింహభారతీ చరిత్రము, శ్రీచంద్రశేఖర భారతీ చరిత్రం, కామకోటి యతీశ్వర చరిత్రం, గురు స్మృతి అనే గ్రంధాలేకాక వైరాగ్య బోధకాలు స్తోత్రాశీర్వచన రూపకములైన అనేక శ్లోకాలు రచించారు.

### ఆదర్శ న్యాయవాది

విద్యాశంకర భారతీపూర్వాశ్రమంలో వారి వ్యవహారిక నామం, రాళ్ళబండి సీతారామశాస్త్రి వృత్తిరీత్యా న్యాయవాది ముస్లిం 'లా'ను ప్రత్యేక శ్రద్ధతో అధ్యయనం చేసినందువలన ఆయన కక్షిదార్లలో ఎక్కువమంది ముస్లింలుగా వుండేవారు ఆయన న్యాయవాది అయినా-వాద ప్రతివాదులు–న్యాయస్థానాలలోకాక న్యాయస్థానాల వెలుపల పరస్పర సద్భావం, సామరస్యంతో తమ వివాదాలను పరిష్కరించుకోవడానికి ప్రథమ ప్రాధాన్యత యిచ్చేవారు తోటి న్యాయవాదుల గౌరవాన్నేకాక న్యాయమూర్తుల గౌరవ విశ్వాసాలు పొందడంకూడా ఆయన విశిష్ట వ్యక్తిత్వానికి అద్దం పడుతుంది ఆయన కోర్టులో ఒక ప్రకటన చేశారంటే-అది వాస్తవబద్ధంగా

వుండేది  న్యాయమూర్తులు ఎట్టి సంకోచం లేకుండా వాటిని ఆమోదించేవారు  శాస్త్రిగారు తన వృత్తిలో నిర్భయత్వాన్ని ప్రదర్శించేవారు  న్యాయమూర్తి పొరపాటు చేస్తే - నిర్మొహమాటంగా నిర్భయంగా దాన్ని పేర్కొనేవారు

భార్య దివంగతురాలయిన తర్వాత – తన జీవిత చరమాశయమైన సనాతన ధర్మప్రచారానికి తన శేష జీవితాన్ని అంకితం చేయదలిచారు  దానికి తన సంసారిక జీవితమేకాక న్యాయవాద వృత్తి ప్రతిబంధన మని నిశ్చయించుకుని ఆయన న్యాయవాద వృత్తిని ఐచ్ఛికంగా వదలుకున్నారు  ఆ సమయంలో బందరు లోను ఇతర పట్టణాలలో న్యాయమూర్తులు, న్యాయ వాదులు, పండితులు ఒక అపూర్వ పద్ధతిలో సన్మానసభ ఏర్పర్చి గౌరవించారు  ఇది బందరు న్యాయవాదుల చరిత్రలోనే అపూర్వమైన విషయం.

## సాంగవేద పాఠశాల స్థాపకులు

సన్యాసాశ్రమాన్ని స్వీకరించడానికి చాలాకాలానికి ముందే – సనాతన ధర్మ పునరుద్ధరణలో భాగంగా బందరు గొడుగుపేటలో తన నివాసానికి ప్రక్కనే సాంగవేద పాఠశాలను - గురుకులం పద్ధతిలో స్థాపించారు  ఈ పాఠశాల అధ్యాపకులుగా వైయాకరణ పంచాస్యుడు - విశ్వనాధవంటి మహాకవులకు గురువు ఉత్తమ పౌరాణికుడయిన కంభంపాటి రామమూర్తిశాస్త్రి తర్క వేదాంతశాస్త్ర నిష్ణాతుడు  మండలీక వేంకటశాస్త్రి పండిత శ్రేష్టుడు కుప్పా లక్ష్మావధానివంటి మహా మహు లను నియమించారు  ఈ కారణంగా ఈ సాంగవేద పాఠ శాల ఆంధ్రదేశ ప్రశస్తిని పొందగలిగింది  ఈ పాఠ శాలనుంచి అనేకమంది వేదపండితులు రూపొంది పాఠశా లకు గౌరవ ప్రతిష్టలు చేకూర్చారు  సాంగవేద పాఠశా లతో తృప్తి చెందకుండా శంకర మఠాన్ని స్థాపించారు  ఈ శంకర మఠంలో – శంకరాచార్య, గాయత్రీ, దత్తాత్రేయ, దక్షిణామూర్తి, విఘ్నేశ్వరాది విగ్రహాలు శాస్త్రోక్తంగా ప్రతిష్ఠించబడ్డాయి

సన్యాసాశ్రమాన్ని స్వీకరించడానికి ముందు పూరవి రంగంగా- అక్షర లక్షలసార్లు గాయత్రీ మంత్రజపాన్ని, నృసింహ మంత్రజపాన్ని నిష్ఠతో పఠించారు  కామకోటి పీఠాధిపతులువారి అనుగ్రహముతో శ్రీ విద్యోపదేశం పొంది తిరుపాసనను సమగ్రంగా చేశారు  శృంగేరి పీఠాధిపతి చంద్రశేఖర భారతీస్వామివారి అనుగ్రహం పొంది వారి ఆజ్ఞానుసారం అభినవ విద్యాతీర్థుల వారిని దర్శించి వారి అనతితో సదాశివేంద్ర సరస్వతీస్వామి వలన బందరులో సన్యాసాశ్రమదీక్ష పొంది శ్రీ విద్యా శంకరభారతిగా సార్థక దీక్షా నామధేయులయ్యారు తను పెంచి పెద్దచేసిన సాంగవేద పాఠశాల ఆవరణలో (విద్యారణ్యంలో) గాయత్రీ పీఠాన్ని స్థాపించారు

## ఏకసంథాగ్రాహి

సీతారామశాస్త్రిగారు ఏకసంథాగ్రాహి – ఏ విషయ మయినా ఒక్కసారి విన్నా ఒకసారి చదివినా అది వారి మనోఫలకంపై ముద్రింపబడేది  ఒక్కసారి హరి నాగభూషణంగారి షష్టిపూర్తి సందర్భంగా కాటూరు వెంకటేశ్వరరావుగారు - తన సహజసిద్ధ పాండితీ శైలిలో కృష్ణాపత్రికలో ప్రచురణార్థం ఒక పేజీ వ్యాసాన్నితయారుచేసి సీతారామశాస్త్రిగారికి యిచ్చారుట. దురదృష్టవశాత్తూ ఆ వ్యాసం వారి ఆఫీసులో ఎక్కడో పోయింది  ఎంత వెదకినా కన్పించలేదు  సీతారామ శాస్త్రిగారు ఆ వ్యాసాన్ని ఒకసారి యథాలాపంగా చదివి వున్నారు  దాన్ని తన జ్ఞాపకశక్తిచే దాదాపు యథా తథంగా పునఃసృష్టి చేయగలిగారు  తర్వాత ఆ వ్యాసం బయటపడినప్పుడు - రెండింటినీ పోల్చిచూస్తే - ఏది అసలో ఏది నకలో తేల్చడం కష్టమయిందట

తన ఆఫీసులో భిన్నములైన కేసులకు సంబం ధించిన నోట్సును ఒకేసారితెలుగులోనూఇంగ్లీషులోనూ డిక్టేటుచేస్తూ "అష్టావధానం" చేస్తూవుండేవారిని ఇప్పటికీ అబ్బురంగా చెప్పుకుంటారు

శ్రీవాణి

## మానవతావాది

సీతారామశాస్త్రిగారు మానవతావాది ఎవరికి అన్యాయం జరిగినా దాన్ని నివారించేందుకు ప్రయత్నించేవారు భాగవతుల కుటుంబరావుగారు బందరు హిందూ కళాశాలలో సంస్కృతాధ్యాపకులుగా పనిచేస్తూ వుండేవారు కొజ శివరామ కృష్ణారావుగారు ప్రిన్సిపాల్‌గా వుండేవారు ఏ కారణంవల్లనో వారికి కుటుంబరావు గారి పైన ప్రతికూలభావం కలిగింది "ఎం ఏ పరీక్షలో ఉత్తీర్ణులు కాలేదు" అన్న నెపంతో వీరిని ఉద్యోగం నుంచి తొలగించడానికి ప్రయత్నం జరిగింది కాలేజీ కమిటీ సభ్యులు ఒకరు సీతారామశాస్త్రిగారికి తెలియ చేశారు అప్పటికి ఆయన భార్య దివంగతురాలయి ఆరు రోజులే అయింది అయినప్పటికీ ఆయన — కుటుంబరావుగారి యోగ్యతాపత్రాలను సంపాదించి కమిటీ సభ్యులకు అందజేసి వారి ఉద్యోగాన్ని నిలిపారు ఈ విషయాన్ని కుటుంబరావుగారు ఒకచోట స్వయంగా ప్రస్తావించారు.

సీతారామశాస్త్రిగారు జాతీయవాది — కాంగ్రెస్ అభిమాని - కాని సనాతన ధర్మానికి వ్యతిరేకమయిన కాంగ్రెస్ విధానాలు ఆదర్శాలు ఆయనకు నచ్చేవి కావు సనాతన ధర్మప్రచారం కోసం "పాంచజన్యం" అనే పత్రికను స్థాపించి కాంగ్రెస్‌వాది సనాతనధర్మ వ్యతిరేక విధానాలను తీవ్రంగా విమర్శిస్తూ స్థానిక కాంగ్రెస్ నాయకులను కలవరపరుస్తూవుండేవారు సన్యాసాశ్రమం స్వీకరించాక "శంకరభారతి" అనే పత్రికను కొన్ని సంవత్సరాలు నడిపారు. అనేకచోట్ల గీతయజ్ఞాలు నిర్వహించారు

## బిరుదులు — సత్కారాలు

ఆయన సన్యాసాశ్రమాన్ని స్వీకరించడానికి ముందే వారణాసిలోని మహావిద్యాసంస్థ "ధర్మరంజని" అయోధ్య విద్యాపీఠం "విద్యాభూషణ" త్రిలింగ విద్యా మహాపీఠం - "వేదశాస్త్ర సముద్ధర్త" అనే బిరుదులతో సత్కరించింది సన్యాసాశ్రమ స్వీకారం చేసిన తర్వాత సికింద్రాబాద్‌లో భక్తులుఆయనకు గజారోహణ చేయించి సత్కరించారు

మనసా వాచా కర్మణాధ కూడా సంసారికంగా వ్యక్తి పరంగా ధర్మనియమబద్ధమైన జీవితాన్ని గడిపారు. బందరు గొడుగుపేటలోని శంకరమఠం, సాంగవేద పాఠశాల ఆయన పవిత్ర స్మృతికి సజీవ చిహ్నాలుగా ఇప్పటికీ అలరారుతున్నాయి



### కాంతి కుసుమం

పెరిగే అజ్ఞానకాల
వడగాలులకు వడలి
సమతా వృక్షం మోడులా మారగా
భవిష్యత్తు అంధకారమని
ప్రకృతి ఆక్రోశిస్తుంటె
నేనున్నా నంటూ
కాంతి కుసుమం కోసుకొచ్చి
కాల శిఖలో తురిమి
చైతన్య సుగంధాల్ని
అందరికీ పంచాలని
ఆత్మవిశ్వాసమే శ్వాసగా
నిశిలో కసిగా
ముందడుగు వేస్తున్నా ..

(రాష్ట్రస్థాయి మినీ కవితల పోటీలో ప్రథమ బహుమతి పొందినది)

— బొగ్గరపు రాధాకృష్ణమూర్తి

# ముళ్ళపూడి ఒక మైలురాయి!

ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం

మధ్యాక్కరకు ప్రాణం పోసింది నన్నయ జీవించటం నేర్పింది విశ్వనాథ భారత రచనలో నన్నయ, ఎఱ్ఱాప్రెగ్గడలు మధ్యాక్కరలను కథాకథన పద్ధతిలో ప్రయోగించి దాని అస్తిత్వానికి ఆంధ్ర సాహిత్యంలో అంకురారోపణం చేశారు ఆ ప్రయోగాల లోని ఛందశ్శిల్పాన్ని సమీక్షించి డాక్టర్ పాటిబండ్ల మాధవశర్మగారు ఇలా వివేచించారు "కోపము, పశ్చాత్తాపము, దుఃఖము, ప్రబోధము, ప్రార్థనము, అధిక్షేపము, విస్మయము, నింద, స్తుతి, ఉత్సాహము, రతి, సభావర్ణనము— మున్నగు పెక్కు విషయము లందు అక్కర ఉపయోగింపబడినది" (ఆంధ్ర మహాభారతము-ఛందశ్శిల్పము-పు. 382)

నన్నయ తరువాత మధ్యాక్కరకు పునర్జన్మ కల్పించిన కవిసమ్రాట్టు విశ్వనాథవారే పది శతకాలు మధ్యాక్కరలలో రచించి ఆ ఛందానికి అధునికమైన ఒక సజీవాభివ్యక్తిని కల్పించారు. వస్త్వాశ్రయమైన ప్రాచీన మధ్యాక్కర రచనకు ఆత్మాశ్రయమయిన ఆత్మీయభావ ప్రకటనను అలవరచారు కావ్యకథా సూత్రంలోకంటె ముక్తకంగా మధ్యాక్కర మణిదీపంలా వెలుగుతుందని నిరూపించారు వర్ణనంలో కంటె మనస్సులోని వెదనను చనువుగా చెప్పుకొనే పద్ధతిలో అది పదునుగా పనికి వస్తుందని శతక ప్రక్రియలో శతధా ప్రయోగించి చూపించారు దేవునికి చెప్పుకొనే జీవుని వేదనచే మధ్యాక్కరగా విశ్వనాథవారు తమ శతకాలలో రూఢికెక్కించారు ఇహపరాల మధ్య సాగే ఊహల ఊగిసలాటలను పాదవిన్యాసాలుగా, వాక్యగతులుగా, అభివ్యక్తుల అలంకారాలుగా, ఉక్తి వైచిత్రులుగా జీవద్భాషలో తెలుగు తియ్యందనాలను వెలార్చే మధురాక్కరలుగా విశ్వనాథవారు శిల్పించారు వచన కవిత్వం లయాత్మక సంభాషణగా జాలువారి ఒక ఛందస్సైనట్లుంటుంది— విశ్వనాథ మధ్యాక్కర మకుటం ఉంచేసే మధ్యాక్కర మనోజ్ఞంగా రూపొందుతుందనే అభిప్రాయాన్ని, అలవాటును ఆంధ్రులకు అలవరచారు విశ్వనాథవారు విశ్వనాథవారి మధ్యాక్కర శతక రీతికె ఒక నవ్య సంప్రదాయం

విశ్వనాథవారి మధ్యాక్కర శతక ప్రయోగాలను బాణీలుగా పెట్టుకొని తనదైన పలుకుబడితో పలికి తన ప్రత్యేకతను చాటుకొంటున్న సత్కవి శ్రీ ముళ్ళపూడి సచ్చిదానందమూర్తిగారు వీరిప్పటికి మధ్యాక్కరలలో మూడు శతకాలను రచించారు శ్రీ కురవి వీరభద్ర మహాత్మ్యము (1977) మకుట విశిష్టమైన 167 మధ్యాక్కరల రచన క్షేత్రదైవ మహాత్మ్యాలను శతక సౌరభం గుబాళించేటట్లు కూర్చిన పద్యమంజరి 'వెండికొండ పావురాలు' అనే పేరుతో వెలువడిన వెండికొండ సిద్ధేశ్వర శతకం (1978) 125 మధ్యాక్కరల రచన మొదటి దానికంటె రెండవది విశ్వనాథ మధ్యాక్కర శతక స్వరూప స్వభావాలను విశేషంగా సంతరించుకున్నది ఇటీవల వెలువడిన ముచ్చటైన మూడో మధ్యాక్కర శతకం 'యాదగిరి ముత్యాలు' 175 పద్యాల రచన

ముళ్ళపూడివారు ఈ శతకాలేకాక 'తెలుగుబిడ్డ' అనే కావ్యాన్ని, "పవిమనిషి" అనే కథల సంపుటిని, "మహాభియానం" అనే కవితా సంపుటిని, "రుక్మిణీ కల్యాణం" అనే రాజకీయ నవలని, "సీతారాముల

కల్యాణం" అనే కావ్యాన్నీ, మాత్రా ఛందస్సులో "సుందరకాండ"నూ రచించారు రచనలనుబట్టి చూస్తే కవిత్వంలో పద్యగేయ వచన రచనా పద్ధతులన్నీ మూర్తిగారికి కరతలామలకాలని స్పష్టమౌతోంది కథ, నవల ప్రక్రియలుకూడా వారి రచనా పరిధిలోనికి వచ్చాయి అంటే సమకాలీన సాహిత్య ప్రక్రియలలో వారికి అభినివేశంతోపాటు సామర్థ్యం కూడా ఉన్నట్లు విదితమౌతోంది అయితే, ముళ్ళపూడివారి పద్య రచనల్లో వారి కవితాభివ్యక్తిని ముమ్మూర్తులా ఆకట్టుకొన్న ఛందం మధ్యాక్కర శతకాలన్నీ చదివిన తరువాత మధ్యాక్కర సచ్చిదానందమూర్తిగారూ అవి వారివి పిలవాలని నాకు అనిపించింది వారి జీవలక్షణానికీ మధ్యాక్కరకూ అంతటి మధురసంబంధం ఉంది

తెలుగునాట వెలసిన దైవమూర్తుల దివ్యత్వాన్నీ, తెలుగువారికి వారిపట్ల ఉన్న ఆత్మీయతనూ వ్యక్తం చేసేవి మధ్యాక్కర శతకాలు మనస్సులో ఉన్న గుట్టును మొగమాటం లేకుండా చెప్పుకోవటానికి ముక్తసరిగా తోడ్పడే ముచ్చటైన ఛందం మధ్యాక్కర దీనిలో భక్తిశతకం వెలువడ్డా అది ఆత్మనివేదన రూపంగాకంటె ఆత్మవేదన సంవేదనరూపంగా ఎక్కువగా భాసిస్తుంది, తన్మయత్వంకంటె తత్పరత్వాన్ని ఎక్కువగా అందిస్తుంది, ఆలోచనకంటె ఆర్తిని అధికంగా అంతరంగంలో నిలుపుకుంటుంది, తుకతుక ఉడుకుతున్న లౌకిక జీవన సంవేదనలోనుండి వెలువడుతున్న ఆధ్యాత్మిక చింతనమనే సెగల పొగల చిత్రవిచిత్ర గతులను తనలో ప్రతిఫలింపజేసుకుంటుంది, వాస్తవం నుండి పారమార్థికం వరకు మానవుడు చేసే తర్కవితర్కాలను సూటిగా ఘాటుగా వ్యక్తం చేస్తుంది సచ్చిదానందమూర్తిగారి మూడు శతకాల్లోనూ, విశేషించి 'యాదగిరి ముత్యాలు'లో ఈ లక్షణాలన్నీ సహజంగా రాణిస్తున్నాయి

మూర్తిగారిలో ఆధునిక ప్రవృత్తిలో ఉన్న ఆధ్యాత్మికకామనకీ ఉంది, సామాజిక స్ఫూర్తీ ఉంది ఆకలి బాధ యెరుగని ధనికవర్గ నాయకునిగా భావించి యాదగిరి నృసింహస్వామిని అధిక్షేపించినట్లున్న ఈ మధ్యాక్కరకు అధిక్షేపమే అలంకారం

"కొండమీద గుహాంతరమున కోరి
కాపుర ముంటివయ్య!
వెండి తొడుగు తొడిగికొని వీరాధివీరుని బోలె
నెండిన డొక్కల యేడ్పులెట్లు
విన్పించునో! కడుపు
నిండిన దొరవు, యాదగిరి నిలయ!
శ్రీలక్ష్మీనృసింహా!" (పుట 7)

మాయమర్మాలు లేకుండా అమాయకంగా మాట్లాడుతున్నా వేదాంతపు మార్మికతను సన్నని మేలిముసుగులాగా కప్పినట్లు కనిపించే పద్యం

ఏల బంపించితివయ్య ఈ అద్దెకొంపకు నన్ను?
ఖాళీ చేయుమని వెగటుగ కసరుదు
రటునిటు గాక
వ్రేలాడుచుంటి స్వస్థలము విడిచి
వచ్చి మతిలేకిపుడు
నీలుగుచుంటి, యాదగిరి నిలయ!
శ్రీ లక్ష్మీనృసింహా!" (పు. 11)

కవి హేతువాదాన్ని నిరసించి, జాతీయవాదాన్ని బలపరచేవాడు నిరసనను తర్కబద్ధంగానూ, కట్టె విరిచినట్లుగానూ చెప్పగలిగిన దిట్టతనాన్ని ప్రకటించాడు మధ్యాక్కరలో

"హేతువాదమట! అదే జయించి
తీరునట! మనకొక
జాతీయత యని, దేశమని, సంప్రదాయ
మని లేవంట!
తాత లాస్తులకు మాత్రమ్ము తాను
వారసుడట! వింటె

నీతి నే జెద్ది? యాదగిరి నిలయ!
శ్రీ లక్ష్మీనృసింహా!"

హింసావాదాన్ని ఖండిస్తూ అచ్చమైన వ్యావహారిక శైలిలో కచ్చెను కళ్ళకు కట్టించేటట్లు చెప్పిన మధ్యాక్కర

" ఇల్లు వాకిళ్లు పొలాలు, నిన్న
మేడలు మిద్దెలుండి
వీళ్ళ దుంప తెగ, రోగమ్మ వీరలకేమి పుట్టినది!
వాళ్ళ వీళ్ళ తలలు గొట్టి పచ్చి
నెత్తురు త్రాగుదురని
నీళ్ళైన యట్లు, యాదగిరి నిలయ!
శ్రీలక్ష్మీనృసింహా!" (పు. 20)

పారమార్థిక చింతనకు పసిడి విచ్చెనగా మధ్యాక్కరను వాడిన వైఖరి—

" చచ్చుచుఁ బుట్టుచు మరలఁ
జచ్చుచుఁ బుట్టుట కంటె
వచ్చిన మార్గము బట్టి నమ్మి తిరించుట మేలు
అచ్చెరువేమి? దాసికోక హరినామకీర్తన పసిడి
నిచ్చెన యౌను, యాదగిరి నిలయ!
శ్రీ లక్ష్మీనృసింహా!" (పు. 35)

ఈ శతకంలో అంతస్సూత్రంగా ఆధ్యాత్మిక చైతన్యాన్ని అందించిన దివ్యతేజస్సే యాదగిరి శ్రీ లక్ష్మీ నృసింహస్వామి — అనే సత్యం చివరి పద్యంలోగాని స్పష్టం కాదు " అద్ది ఉదయాస్తమయములు లేని ఒక దివ్యబిందువు" అని నిదురలో కూడ దోచు "

ఈ యుగంలో ఆధునిక శతకమంటే మధ్యాక్కర శతకమే ఇంతవరకు తెలుగులో వెలువడిన వివిధ రకాల శతకాల ప్రవృత్తులన్నిటినీ తనలో అవలీలగా ప్రతిఫలింపజేసుకోగలిగిన ప్రజ్ఞ ఈనాడు మధ్యాక్కర సాధించింది ఆధునిక జీవితంలోని సంశ్లిష్టతను, సంక్లిష్టతను సరళంగా, జాతీయంగా, సజీవంగా, సహజంగా చెప్పగలిగిన వృత్తం మధ్యాక్కర నిందించటానికీ, స్తుతించటానికీ, నిష్ఠురాలాడటానికీ, నిజం చెప్పటానికీ, కోపతాపాలను వ్యక్తం చెయటానికీ, అధిక్షేపించటానికీ, ఆర్తికీ, స్మృతికీ, ప్రబోధానికీ, వితర్కానికీ, భక్తికీ, హాస్యోక్తికీ, మార్మికతకూ, వక్రతకూ మధ్యాక్కర ఈ శతకంలో మనోజ్ఞంగా ప్రయోగింపబడింది

విశ్వనాథవారు మధ్యాక్కరకు మర్యాదగా జీవించే మనుగడను, మాట్లాడే తీరునూ నేర్పి పెద్దరికాన్ని కట్టబెట్టారు ముళ్ళపూడివారు పద్యాల మనుగడకే ముళ్ళబాట లేర్పడ్డప్పుడు మధ్యాక్కరకు మల్లెబాటలు కల్పించి ఆధునిక జీవితంలో అలవోకగా విహరించే సౌకర్యాలు కల్పించారు

తెలుగులో సాగుతున్న మధ్యాక్కర ప్రస్థానంలో విశ్వనాథ ఒక పెద్ద మలుపు ముళ్ళపూడి ఒక మైలు రాయి ఇది యాదగిరి నృసింహస్వామి సాక్షిగా యధార్థం ○

శ్రీవాణి

( 12 వ పెజీ తరువాయి )

యోచించక నూరు కొరడా దెబ్బలు కొట్టమని పురమాయించాడు మహమ్మద్ ఆ విధంగా వుండాలి న్యాయం. తన పర బేధము లేకుండా సర్వులకూ సమానమయిన శిక్ష వుండాలి యాభై దెబ్బలు కొట్టేటప్పటికి మహమ్మద్ కుమారుడు ప్రాణం విడిచాడు సమాధి చేశారు సిపాయి వచ్చి ఇంకా యాభై దెబ్బలు మిగిలినాయి వాటిని ఏమి చేయమంటారని అడిగాడు ఆ యాభై దెబ్బలు సమాధిమీద కొట్టమన్నాడు మహమ్మద్ చూచారా ! ఎంత న్యాయం? ఎంత ధర్మం? ఎంత పవిత్రత ఆనాడు వుండేదో ... ఈనాడా ! తన పరబేధములను మనస్సులో వుంచుకొని పరాయివాడైతే పది సంవత్సరములు శిక్ష, తనవాడైతే కోర్టు పూర్తిగా శిక్షనే రద్దు చేస్తుంది శిక్ష ఏ విధంగా తప్పించాలా యని యుక్తితో, కుయుక్తితో ఆలోచిస్తుంటారు ఇట్టి కుయుక్తులతో, అల్పబుద్ధులతో, అల్పమైన భావములతో కూడినటువంటిది కాదు న్యాయం న్యాయము న్యాయమే అలాంటి దానినే గౌతముడు దీనిని ఆవిర్భవింపజేశాడు ఇదియే న్యాయదర్శనము.

ఈన్యాయదర్శనంతోపలనే మొట్టమొదటిది ప్రత్యక్ష ప్రమాణం రెండవది అనుమాన ప్రామాణం కొంగలు అక్కడ బాగా తిరుగుతున్నాయంటే, ఆ ప్రాంతంలో నీరున్నదని విశ్వాసం నీరు కనిపించ లేదు కాని కొంగల గమనాన్ని సాక్ష్యంగా తీసుకొని నీరుంటుందని ప్రమాణం నిర్ణయిస్తున్నాడు ఇక్కడెక్కడో పొగవస్తున్నది అగ్ని కనిపించటంలేదు పొగను ఆధారం చేసుకొని అగ్ని వుంటుందని విశ్వసిస్తున్నారు ఇక్కడెక్కడోదుర్గంధవస్తున్నది, సుగంధంవస్తున్నది దుర్గంధం నాధారంచేసుకొని ఏదో మురుగు ఉన్నదని, సుగంధం నాధారముచేసుకొని మల్లెపూలు ఉండి ఉండాలని స్వరూపాన్ని నిరూపణ చేసుకొంటున్నాడు. స్వరూపం కనిపించక పోయినప్పటికినీ, స్వభావాన్ని విశ్వసించి, ఈ విధమైనటువంటి స్వరూపం వుండవచ్చునని విశ్వసించడం అనుమాన ప్రమాణం ఈ అనుమాన ప్రమాణం కూడా ఒకటి అవసరమే ఈ దివ్యమైన ప్రకృతియందు, కెవలం ఇంద్రియములతో కూడినటువంటి దేహముతో, హృదయముతో కూడినటువంటి మనస్సుతో, అనుమానములు కూడనూ ప్రమాణములుగానే తోస్తుంటాయి కనుక అనుమాన ప్రమాణమనగా విషయాన్ని ఆధారం చేసుకొని, విషయ స్వరూపాన్ని నిరూపణ చెయటమే అనుమాన ప్రమాణము ఇక ఉపమాన ప్రమాణమనగా ఏమిటి? భౌతికము, పారమార్థికము అనేవి ఉంటుంటాయి సముద్రం ఉన్నది ఈ సముద్రంలో అలలు బయలుదేరినాయి అలలయందు చూచినా, నురుగు నందు చూచినా సముద్ర జలమే ఉంటుంది ఈ మూడింటిని విచారణ చేసుకొని ఒక విధమైన ఉపమానము తీసుకొనవచ్చును పారమార్థికము, ప్రాతిభాషికము, వ్యావహారికము అంటే ఏమిటని ప్రమాణం చెప్పమంటే, ప్రాతిభాషికము అంటే అల వ్యావహారికము అంటే నురుగు, పారమార్థిక మనగా జలము ఈ అన్నింటిలోనూ ఉన్నది ఒకే జలము అనే ఉపమానాన్ని తీసుకొని దీనిని ఏకత్వంగా భావించడం, పారమార్థికము అనేటటువంటి సముద్రజలము నుండియే ప్రాతిభాషికము అనే అలలు ఆవిర్భవిస్తున్నాయి ఆవిర్భవించినటువంటి ప్రాతిభాషికమనే అలలయందే ప్రాకృతమైనటువంటి నురుగు ఉంటున్నది కనుక వ్యావహారికమే నురుగు ప్రాతిభాషికమే అల, పారమార్థికమే సముద్రము ఇలాంటి ఉపమానాన్నితీసుకొని అర్థంకానివిషయాన్ని అర్థమయ్యే రీతిగా నిరూపించటం కేసులు సాక్ష్యాలు ఏ విధంగా ఆధారమో, సత్యమును గుర్తించటానికి ఈ విధములైన ఉపమానములు అత్యావసరం ఉపమానముల చేత మన మనస్సుకు అందనటువంటి వాటికికూడా అర్థమయ్యే రీతిగా గుర్తించవచ్చును దీనినే ఉపమాన ప్రమాణమన్నారు ఇక శబ్దప్రమాణము అంటే ఏమిటి? శబ్దప్రమాణమునే సత్యప్రమాణముగా భావిస్తూవచ్చారు ఈ సత్యప్రమాణమును ఆధారము చేసుకొనియే వేద

ములు, వేదాంగములు, ఉపనిషత్తులు, భగవద్గీత — ఈ మహాగ్రంథములన్నియూ వచ్చినాయి ఈ శబ్ద ప్రమాణము మనకు ఏ రీతిగా సంభవిస్తుంది? ఈ ఇంద్రియములయొక్క తత్త్వాన్ని పూర్తిగా అణగ త్రొక్కాలి చూచిన కన్నులకు, విన్న చెవులకు, తలచిన మనస్సుకు, విచారించిన బుద్ధికి అతీతమైన స్థితికి పోవాలి. అందువలననే "బుద్ధి గ్రాహ్యం అతీంద్రియమ్" అన్నారు కనుక మనము ఈ ప్రత్యక్ష ప్రమాణము, అనుమాన ప్రమాణము, ఉపమాన ప్రమాణములను వదలిపెట్టి శబ్దప్రమాణము నకు పోవటంలో చాలా జాగ్రత్తగా ఉండాలి

"సకల విద్యలు నేర్చి సభ జయించగవచ్చు
శూరులై రణమున పోరవచ్చు
రాజరాజై పుట్టి రాజ్యమేలగవచ్చు
హేమ గోదానముల్ ఈయవచ్చు
గగనమందున్న చుక్కలు లెఖగొనవచ్చు
జీవరాసుల పేర్లు చెప్పవచ్చు
అష్టాంగ విద్యల నన్ని నేర్వగవచ్చు
చంద్రమండలమైన చేరవచ్చు
కాని దేహేంద్రియముల నరికట్టి
మనసు నిల్పియు నంతర్ముఖమ్ము చేసి
అనవరతము నిశ్చల సమానచిత్తులై
నిలువగా లేరు మానవుల్ నియతితోడ

నిశ్చల సమాన చిత్తుడు కావాలి తరంగముల వలె అటూ ఇటూ ఊగిసలాడే మనస్సుగలవాడు కాకూడదు అదియే శబ్దబ్రహ్మము కనుకనే "శబ్దబ్రహ్మమయి చరాచరమయి, జ్యోతిర్మయి, వాఙ్మయి, నిత్యానందమయి, పరాత్పరమయి మాయామయి, శ్రీమయి" అష్టైశ్వర్య స్వరూపముతో కూడి నటువంటిది ఈ శబ్దము ఎక్కడో దూరంగా వుండినటు వంటి వానిని "ఓ బాబా!" అని పిలిస్తే ఆ శబ్దముచేతనే కనుక్కొని తిరగవస్తున్నాడు అంతవరకూ పోనవసరం లేదు. నిత్యమూ శబ్దముచేతనే టీవిల ద్వారా మన హృదయానికి ఆనందాన్ని యివ్వటమో లేక దుఃఖాన్ని యివ్వటమో జరుగుచున్నది ఇవన్నీ కూడనూ శబ్ద ప్రమాణములే కనుకనే ఈ శబ్దములన్నిటిపైననూ ప్రమాణ శబ్దము భగవత్ సంకీర్తనము కనుకనే ఒకా నొక సమయమున నారదుడు విష్ణుమూర్తి వద్దకు వెళ్ళి "స్వామీ! తమ దర్శనార్థమై అప్పుడప్పుడూ వస్తుంటాను ఇది నా సహజం అయితే నాకు అవసరం వచ్చినప్పుడు తమర్ని సందర్శించుకోవాలంటే ఎక్కడికి రావాలి? నీ Head Office ఎక్కడ?" అని అడిగాడు అప్పుడు విష్ణుమూర్తి "మద్భక్తాః యత్ర గాయన్తి తత్ర తిష్ఠామి నారద!" నా భక్తులు ఎక్కడ గానం చేస్తుంటారో, అక్కడ నేను ప్రతిష్ఠ అయి వుంటాను 'ఏనాము నారద!' నేను వసిస్తుంటానని చెప్పలేదు కనుక ఎక్కడ భగవత్ నామమో— అదే శబ్దబ్రహ్మము శబ్దమంటే ఏదో బాంబుల శబ్దము, టపాకాయల శబ్దము కాదు భగవత్ శబ్దమే నిజమై నటువంటి ప్రమాణము మామూలు శబ్దాల వలన మన చెవుల కర్ణభేరులు పగిలిపోతాయి భగవత్ గానమనే శబ్దము మన హృదయాన్ని చక్కగా వికసింపజేస్తుంది కనుక యీ శబ్దప్రమాణమే వేదప్రమాణము ఈ వేదము శబ్దప్రమాణముతో కూడినటువంటిది ఈ నాలుగు ప్రమాణములయందు కూడనూ న్యాయం సమాన మైన అంతర్వాహినిగా ప్రవహిస్తూవస్తున్నది

విద్యార్థులారా! మనము శబ్దస్పర్శ అనేటటువంటి దానితో మన జీవితాన్ని పెడమార్గమున పట్టిస్తున్నాం మనం పవిత్రమైన శబ్దాన్ని వినాలి దైవసంబంధ మైన శబ్దాన్ని వినాలి. కనుకనే న్యాయదర్శనమందు "ఓ మానవుడా! ప్రాకృతిమైన జీవితమునందు కూడనూ, యీ మానవత్వాన్ని కొంతవరకు విశ్వసించి, హృదయ సంబంధమైన తాపముచేత, నిత్య అనిత్య పరిశీలనా శూన్యుడై, సత్యస్వరూపాన్ని నిరూపణ

చేసుకో ! " యీ సత్యమును నిరూపణ చేసేది ఏమిటి? ఏ జడ్జీనో కాదు, ఏ లాయరో కాదు తన చిత్తమే తనకు నిర్ణయం చేస్తుంది మనస్సుకు అతీతమయిన స్థాయిలో అది నిర్ణయం చేస్తుంది దీనినే 'కాన్షన్స్' అన్నారు ఈ కాన్షన్స్‌నే ప్రాణము యొక్క Vibration (కంపనము) అన్నారు ఈ వైబ్రేషన్ యొక్క తత్త్వము చేతనే మొట్టమొదట వాక్కు ఆవిర్భవిస్తుంది మనస్సునుండి పుట్టేటటువంటిది వాక్కు ఆ వాక్కు మనస్సుతో సమానంగా పుట్టినప్పుడు కొంతవరకు భిన్నమైనటువంటి వాక్కుగా రూపొందుతుంది మనస్సుకు అతీతమైనటువంటి స్థాయినుండి వాక్కు ఆవిర్భవించినప్పుడు సత్యవాక్కుగా రూపొందుతుంది ఆ సత్యవాక్కునే "వైబ్రేషన్" అన్నారు దీనినే 'కాన్షన్స్' అన్నారు ఇలాంటి కాన్షన్స్ అనేటటువంటి దానినే "భూర్" అని పిలిచింది వేదాంతం "భువః", "సువః", "భూర్" అనగా ఈ శరీరమునందు సర్వత్రా వ్యాపించినటువంటి 'భువః ఆ వైబ్రేషను ప్రాణశక్తి ఈ ప్రాణశక్తి అనేటటువంటి వైబ్రేషన్ ఎక్కడనుంచి ఆవిర్భవిస్తున్నది? 'సువః' నుంచి అనగా ప్రజ్ఞ (Radiation) నుంచి ఆవిర్భవించుచున్నది Radiation నుంచి Vibration, Vibration నుంచి Materialisation యీవిధంగా సంబంధం ఏర్పడుతున్నది దీనినే 'భూర్భువః స్వః' అన్నారు

ఈ వేదములను అనేక మంత్రాలతో ఉచ్చరిస్తున్నాం ఋగ్వేదమనగా ఏమిటి? వాక్కే ఋగ్వేదం ఇది వాక్కునుంచి ప్రారంభమవుతుంది ఈవాక్కు ఏవిధంగా వస్తున్నది? అంతర్భాగమైన మూలాధారమైన నాభి నుండి వస్తున్నది దీనినే ఋగ్వేదమన్నారు మనస్సునే యజుర్వేదమన్నారు ప్రాణమునే సామవేదమన్నారు ప్రాణమును ప్రాణోపాసనచేత ఒకవిధమైన స్వరము, శ్వాసమనేటటువంటిది ప్రారంభమవుతుంది యీ శ్వాసము సుస్వరముతో కూడినదైపోతుంది ఇదే నిజమైన సామము సామగానమనగా ఏమిటి? ప్రాణోపాసనచేత ఆవిర్భవించినటువంటి శ్రవణానందమే సామము ఈ సామముయొక్క గుణము సుస్వరమైనటువంటిది సుస్వరముతో కూడినటువంటిదే సామగానము ఈ సామగానము ప్రాణము నుండి ఆవిర్భవించినటువంటిది ఇకపోతే యజుర్వేదము యజ్ఞయాగాది క్రతువులయందు మంత్ర స్వరూపమైనటువంటిది ఈ ప్రపంచమునందు మనకు కనిపించే సమస్త తేజస్సును ఒక స్వరూపముగా నిరూపణచేసి, భగవంతుడు తేజోమయుడు అనేటటువంటి రూపాన్ని ధరింపచేసి ఋగ్వేదము ప్రపంచానికి చాటుతూవచ్చింది కనుకనే సామాన్యంగా మన భారతీయులు భగవంతుడు కోటి సూర్యకాంతులతో వెలుగుచున్నాడని ఉచ్చరిస్తుంటారు అనగా తేజస్వరూపమే ఋగ్వేదము. మంత్రస్వరూపమే యజుర్వేదము. గానస్వరూపమే సామవేదము. కనుక యీ మూడూ లోకానికి అవసరమే భగవంతుని తేజోమయుడుగా నిర్మించుకొని, ఆ భగవంతుని మంత్రముతో ఉచ్చరించి, గానంతో ఆనందించమని కోరింది కనుక యీ మూడు వేదములూ దివ్యత్వాన్ని అనుభవింపజేయుటానికి వచ్చినవే ఋగ్వేదము తేజోమయమైనటువంటి భగవంతుణ్ణి, యజుర్వేదము మంత్రపూర్వకమైన ఆరాధనచేత, సామవేదమనేటటువంటి గానముచేత "నీకో లేనంకా" అని బోధించింది గానంతో తప్ప మరోదానితో లీనం కావటానికి వీలుకాదు చాలామంది మాటలతో పద్యాలతో దేవుని ప్రార్థిస్తుంటారు వీటితో హృదయం కరగదు సంగీతంతో మాధుర్యంగా గానంచేస్తే హృదయాన్ని ఆకర్షిస్తుంది కనుక గానంలో యీవిధమైన లీనం ఉన్నది ఈ లీలతత్త్వాన్ని అర్థం చేసుకోలేని వ్యర్థజీవులు గానాన్ని వినలేకపోతున్నారు మనం సుస్వరంగా పాడగలిగినప్పుడు మాత్రమే మైకు ముందు మనం కూర్చోవాలి లేకపోతే మైకుకు దూరంగావుండి శ్రవణం చేస్తే మంచిది అపస్వరంతో చేసే భజనల వలన హృదయాలు చలింపజేస్తాయి నీకు అంత ఇష్టంగా వుంటే నీవు ఒంటరిగా సాధన చేయి ఆ తరువాత మైకు

ముందుకువచ్చి కూర్చొ కనుక భగవంతుని ఆకర్షింప జేసేటటువంటిది, హృదయాన్ని రంజింపజేసేటటువంటిది గానము ఇదియే శబ్దప్రమాణము

భగవత్ తత్త్వము లోపల ఈ న్యాయము న్యాయమనేటటువంటి దర్శనంలో ఇంకా ఎన్నో విధములైన మానవత్వానికి అవసరమైనవి ఎన్నియో వుంటున్నాయి మానవుని సంశయాలన్నింటిని నివృత్తి చేసి మానవ హృదయాలను ఉప్పొంగింప జేసి వికసింపజేసి ప్రకటింప జేసి, ఆవిర్భవింప జేసేటటువంటివి ఈన్యాయంలో చాలా ఉంటున్నాయి న్యాయ, వైశేషిక, సాంఖ్య యోగ, పూర్వమీమాంస, ఉత్తరమీమాంసలను ఈ ఆరు దర్శనములు కూడనూ ఒక్కటొక్కటి మనం విని చక్కగా అర్థం చేసుకుంటే, ఇక మానవత్వంలో మనం చేయవలసిన సాధనలు ఒక్కటీ కూడా వుండవు.

( 8 వ పేజీ తరువాయి )

సంఘర్షణే మానవజీవితం ఏదైనా ఒక సత్కార్యాన్ని సాధించాలంటే, ఆత్మ విశ్వాసం అత్యవసరం సర్వ శక్తి సమన్విత అయిన ఆ మహాశక్తి మనకు తోడు నీడగా వెన్నంటి ఉన్నదనే ప్రగాఢ విశ్వాసం మనలో ఉండాలి పౌరాణికంగా మహిషాసురుడునే రాక్షసుని వధించటానికి సకల దేవతా శక్తుల సమైక్య స్వరూపిణిగా దేవి అవతరించి రాక్షససంహారంచేయటమే విజయదశమి పండుగ ప్రాముఖ్యత ఈ గాధను సూక్ష్మంగా పరిశీలిస్తే మహిషాసురుడు ఎవరో కాదు ! అంటరానితనం, మోసం అవినీతి, కులమత తత్త్వాలనే అక్రమ అనాచార నీచ బుద్ధులు కలవారే మహిషాసురులు ఇటువంటి వారి ఆటలు కట్టించాలంటే ప్రతివ్యక్తి తనలో ఉన్నదైవీ గుణంతో మహాశక్తిగా విజృంభించాలి, ఈ మహా యజ్ఞానికి ప్రతివారూ నడుముకట్టాలి ప్రతివ్యక్తిలోనూ మార్పునుతేవాలి అంతేకాని అనుకరణ వ్యామోహంలో పడి, మన సనాతన హిందూ సంస్కృతీ సంప్రదాయాలను, పర్వదినాలను ఏవో పుక్కిట పురాణాలుగా

షడ్దర్శనములు అన్ని కూడనూ, సృష్టియొక్క రహస్యాన్ని నిరూపించి, ప్రబోధించి, ప్రకాశింపజేసి ఆనందాన్ని అందించినటువంటివి కనుక విద్యార్థులు యీ భారతీయ వాఙ్మయమును కొంతవరకు అర్థంచేసుకొనటానికి తగిన కృషిచేయాలి మనం తెలుసుకొని మనుషులమని నిరూపించుకోవాలి ఆనాటి మహర్షులు ఎన్నో విధములైన పరిశోధనలు సల్పి, పరిశీలనలుచేసి యీ పవిత్రమైన సారాంశాన్ని అందించారు సర్వ శాస్త్రములు, సర్వ వేదములు మథించి అందించినటువంటి సుధాసారములే ఈ షడ్దర్శనములు.

( బృందావన్‌లో జరిగిన వేసవి తరగతులలో ది 27-5-93 న భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు చేసిన దివ్య ప్రసంగము నుండి ) ○

---

## శ్రీవాణి జీవిత సభ్యులు



**P S. Ranga Rao**
C I Departments
No. 7, Bazullah Road
T Nagar
MADRAS - 600 017

భావించి, వదలి వేయరాదు వాటిలోని అంతర్గత ప్రబోధాలను, సందేశాలను గ్రహించి ఆచరించిననాడే వాటికి సార్థకత చేకూర్చిన వారమవుతామని ప్రతి ఒక్కరూ గ్రహించాలి ○

నిత్యజీవితంలో ఆధ్యాత్మికం-1

# కాపురాల్లో కలిమిలేములు

-పాతూరి ప్రసన్నం

ఆర్థిక సూత్రాలను, సిద్ధాంతాలను చెప్పటం కోసం యీ వ్యాసం వ్రాయట లేదు

మన సంసారాల్లో డబ్బు తక్కువైనా బాధగానే వుంది, ఎక్కువయినా తంటాగానే వుంది కాబట్టి డబ్బు విషయాల్లో ఎలాటి అవగాహనతో బ్రతికితే జీవితం సుఖమయం అవుతుందో నాలుగు మాటలు చెప్పటమే యీ వ్యాసంయొక్క పరమావధి

## రోజులు ఎలా వున్నాయి ?

లోకం అంతా డబ్బుకు దాసోహం అంటోంది "ప్రయోజకుడు" అంటే అర్థం మేడలు, కార్లు, బ్యాంకు బ్యాలన్సులు, షేర్లు, లక్షల డొనేషన్లు యిచ్చి పిల్లలకు మెడిసిన్, యింజనీరింగు కాలేజీలో సీట్లు, లక్షల కట్నాలిచ్చి అమ్మాయికి పెళ్ళి, అమెరికాలో కొడుక్కి 'గ్రీన్' కార్డు రావటంగా గుర్తింపబడుతున్న రోజులివి ద్రవ్యోల్బణం, అవినీతి, నల్లధనంయొక్క ప్రాబల్యం సామాన్య గృహస్థుల జీవితాల్లో చిచ్చులు రగులుస్తున్నాయి. ఉన్నవి రెండే కులాలు అనిపించుతోంది ఒకటి డబ్బున్నవాళ్ళు, రెండు డబ్బులేనివాళ్లు. డబ్బున్న అన్నకు డబ్బులేని తమ్ముడు పరాయివాడితో సమానమే డబ్బు ఎక్కడ ఖర్చయిపోతుందో అని బాధపడుతూ రిటైరయిన అమ్మనూ నాన్ననూ "వృద్ధాప్యం గృహాల్లో" (Homes for the Aged)కి చేర్చటానికి కొడుకులూ కోడళ్లూ సిద్ధపడుతున్న రోజులివి ఒక్కమాటలో చెప్పాలంటే ఎంత డబ్బు సంపాదించినా చాలటంలేదు "ఏం చేయాలి ? ఎలా చావాలి ?" అనే రెండు ప్రశ్నలు వేధిస్తున్న రోజులివి

ఈ దుర్భరమైన ఆర్థిక సమస్య అనే రాక్షసియొక్క వికటమైన అట్టహాసాలతో బెదిరిపోతూ, మూర్ఛలు పోతున్న మనకు భగవాన్ బాబావారి సందేశ శ్రీవాణి చక్కని ప్రబోధం అందిస్తోంది

"విషంతో నిండిన బంగారపు పాత్రకంటే, అమృతంతో కూడిన మట్టిపాత్ర ఎంతో విలువయినది ఈ మానవదేహం, మానవ జీవితం అమృతంతో నిండిన మట్టికుండ వంటివి దేశంలో క్షేమసౌభాగ్యాలుండవచ్చు కానీ జీవితం నికృష్టంగా వుంటే అతి శోచనీయమే జీవిత ప్రమాణాలు తక్కువగావున్నా ఫర్వాలేదు జీవితం నిర్మలంగా, ప్రేమపూరితంగా వినయంతో, పాపభీతితో, పెద్దలపట్ల గౌరవభావంతో కొనసాగితే పేదరికంవల్ల బాధ వుండదు శరీరాన్ని సంస్కరించుకోండి జీవిత విధానాన్ని క్రమబద్ధం చేసుకోండి", అని భగవాన్ శ్రీ సత్యసాయివాణి మనకు మనశ్శాంతి నిస్తోంది ఈ దుర్భరమయిన పరిస్థితుల్లో మన కాపురాల్లో బాగా అన్వయించుకోవలసిన వాక్యాలు యివే

## మన సంస్కృతి ఏం చెబుతోంది ?

ప్రతి వ్యక్తి తన సంపాదనలో పదవ వంతు లోకోపకార్యాలకు ఉపయోగించవలెనని మనుధర్మశాస్త్రం నుంచి, అన్ని మతాలూ చెబుతున్నాయి తన సంపాదనను యిలా పరహితం కొరకు వెచ్చించటమే ద్రవ్యయజ్ఞం అంటుంది గీతామాత అలా చేయక తన కడుపు కొరకు తాము వండుకు తినే వ్యక్తిని దొంగగా చిత్రిస్తుంది గీత రామాయణంలో కబంధు

డనే రాక్షసుడు కనబడతాడు. వాడి తల పొట్టమీదనే వుంటుంది. వాడికిగల చేతులు తాడిచెట్టంత దారుగా వుంటాయి. శ్రీరామలక్ష్మణులు ఆ కబంధుని హస్తాల్లో చిక్కుతారు. కానీ వాడి రెండు చేతులూ నరికి వాడివల్ల లోకానికి కలిగే పీడనుంచి ముక్తి కలిగిస్తారు. కానీ ఈనాడు? ప్రతి విద్యాధికుడూ సమాజంలో ఒక కబంధునిలానే ప్రవర్తిస్తున్నాడు, అంటారు బాబా. కబంధుని తల పొట్టమీద వుండటం అనేది, మన తెలివి తేటల్ని పొట్టకూటికి, స్వార్థానికీ ప్రవేశపరచటాన్ని సూచిస్తుంది. పొడుగాటి చేతులు ఎంత సంపాదించినా తీరని మన ధనదాహానికి చిహ్నం. సమాజంలో పుట్టాం, సమాజంవల్ల మనకు చదువు, డబ్బు, ఉన్నతి ప్రసాదించింది. "అటువంటి సమాజానికి మనకు ఏం చేస్తున్నాం?" అని ప్రశ్నించుకొమంటారు భగవాన్ బాబా. పరుల సంపదను అన్యాయంగా వాంఛించే బుద్ధి అనారోగ్య హేతువు అని చరక మహర్షి ఆరోగ్య సూత్రాలలో ఒకటిగా నిర్వచిస్తారు. ఈరోజున మనకు గల అనేక రోగాలకుగల కారణాలలో ఇదొకటి. "వాడికి వున్నది నాకులేదే!" అనే అసూయ మనల్ని పపప్రాయుల్ని కావిస్తోంది. అసూయే అన్ని దుర్గుణాలకూ తల్లి వంటిది, అంటారు బాబా.

## నిజమైన ధనికుడెవడు?

కోటి రూపాయల ఆస్తి వుంది. రెండు కోట్ల రూపాయల అప్పులున్నాయి. అటువంటి వ్యక్తి నిజమైన ధనికుడేనా? ఒక వ్యక్తి నెలసరి సంపాదన పది వేలు. అతనికిగల కోరికలూ, వాటిని తీర్చుకొనేటందుకు అయ్యే ఖర్చు ప్రతినెలా పది వేలు. అతడు ఎంత సంపాదిస్తే ఎవరికి సంతోషం? కనుక నిజమయిన ధనవంతుడు తనకుగల దానితో సంతృప్తిచెందేవాడే. "పిండి కొలదీ రొట్టె" అనే సామెతకు తగినట్లు నడచుకొనేవాడే. పది పైసలను ఒక మంచిపనికి ఖర్చు పెట్టాలంటే, వంద ఆర్థిక సూత్రాలు వల్లించే వ్యక్తి తన త్రాగుడుకీ, తన చీట్ల పేకలకూ, తన గుర్రప్పందేలకూ వందలూ వేలూ తగలేసేటప్పుడు ఆ సూత్రాలను గుర్తుంచుకోరు. దీన్నే "పెన్నీ వైజ్ — పౌండు ఫూలిష్" అంటారు, ఒక ఆంగ్ల సామెతలో. పైసా వంతు తెలివి, వంద పైసల మూర్ఖత్వమూ అది.

పూర్వం భారత దేశానికి చైనాలో యుద్ధం సంభవించినప్పుడు, ప్రతి ఒక్కరూ "యుద్ధనిధికి" తమకు తోచింది సమర్పించారు. అలాగే నైజాం నవాబుగారిని కూడా యుద్ధనిధికి విరాళం అడిగారు. "నాయనా! నా దగ్గర ఏమీలేదు. నన్ను అడక్కండి", అన్నారు నవాబుగారు. ఆ రోజుల్లో ఇదొక ప్రముఖ వార్తగా పత్రికలవారి ప్రచారానికి గురి అయింది.

నిజమైన శాంతిసుఖాలు కోట్ల రూపాయల ఆస్తుల్లో లేవు. రాబర్ట్ బోజానీ అనే ఒక వాణిజ్య ప్రముఖునికి అమెరికాలో ఒకరోజున తన ఆర్థికమైన అనేకవిధాలుగా వుంటున్న స్కీములతో, వ్యక్తులతో తలనొప్పి కలిగించి, తలుపులు బిడాయించి తన ఆఫీసురూంలో ఒక్కడూ కూర్చొని, జుట్టు పీక్కుంటూ "I dont want money", అంటూ చాలాసేపు అరుస్తూ కూర్చున్నారట వారు. అంతే! ఒక అపరిచితస్వరం వారికి వెంటనే సమాధానం చెప్పింది. "Because you dont money, you will get peace", అంటూ ఆ అపరిచితమైన కంఠస్వరం అభయవాక్యాలు పలికింది. తర్వాత, అలా అశరీరవాణిని వినిపించిన వారేకలలో కనబడ్డారు. వారిని భగవాన్ శ్రీ సత్యసాయి బాబాగా గుర్తించిన శ్రీ బోజానీ ఇండియా వచ్చి ప్రశాంతినిలయంలో భగవాన్ పాద సన్నిధికి చేరారు. అప్పటినుంచీ తనకు ఎంత డబ్బు అవసరమో తాను చేసే సామాజిక సేవలకు ఎంత కావాలో అంతవరకు తన సంపాదనను పరిమితం చేసుకున్న శ్రీ రాబర్ట్ బోజానీ అమెరికాలో శ్రీ సత్యసాయి చెప్పే సేవా కార్యక్రమాలు నిర్వహిస్తున్న ఆధ్యాత్మిక సాధకులుగా మారిపోయారు. ఇదే రీతిగా భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారి దివ్య ప్రభావానికి లోనైన ఎందరో కోటీశ్వ

రులు, లక్షాధికారులు, మిలియనీర్లు కనువిప్పు కలగటం చేత తమ సంపదలను సమాజసేవకు అంకితంచేసే స్వచ్ఛంధ సేవకులుగా తయారవుతున్నారు మనకొక ఆదర్శాన్ని నిరూపించుతున్నారు వారంతా "నిధి చాల సుఖమా ! రాముని సన్నిధి చాల సుఖమా ? మనసా !" అనె శ్రీ త్యాగరాజస్వామి పలుకులకు వీరి జీవితాలు ఆధునిక నిదర్శనాలు.

డబ్బు సంపాదించటంలోకూడా మనకు చాలా దౌర్భాగ్యపు ఆలోచనా విధానాలున్నాయి అవినీతిలో అక్రమమార్గాల్లో పోతేనే ప్రభుత్వాన్ని మోసంచేస్తేనే కోట్లు గడిస్తాం, లేకపోతే లేదు, అనే ధోరణిని ప్రపంచ విఖ్యాత ధనికుడైన రాక్‌ఫెల్లర్, ఫోర్డ్ వంటివారు, మనదేశంలో జంషెడ్, తాతా వంటివారూ ఖండించారు వీరు ఎంత కష్టపడి ఆధునిక యుగపు ఒంటెరులయిందీ "Positive Mental Attitude" లో ప్రఖ్యాత రచయిత శ్రీ నెపోలియన్ హిల్ వివరిస్తారు వారు ప్రపంచ విఖ్యాతులైన ధనికులు కావటం వెనుక గొప్ప ఆశయాలను వారు యేర్పరచుకున్నారు

1) శక్తివంచన లేకుండా కృషిచేయటం అనేది వారి ద్వారా మనం నేర్చుకోవాలి మనదేశంలో పెరిగిపోయినంత సోమరితనం, వళ్ళు దాచుకోవటం అనే దుర్లక్షణాలు అమెరికా, జపాన్ వంటి ఆర్థిక ప్రగతి సాధించే దేశప్రజల్లో కనబడదు మనకు Easy - Money - Making కావాలి అది మన దురదృష్టం

2) పదిమందికి ఆర్థిక ఉన్నతిని కలిగించే పథకాలను యేర్పరచి, వాటిని చిత్తశుద్ధితో ఆచరించటం, ఇతరులనుకూడా సంపన్నులు కావించటంలోనే తాను కూడా నిజమైన సంపన్నత పొందటం అనే భావాలు వారి కృషికి మూలసిద్ధాంతాలు

3) అలా గడించిన సంపదను మానవ సంక్షేమానికే ఖర్చుచేసే త్యాగభావం, సేవాదృష్టితో "ట్రస్టు"లు యేర్పరచి లోకహితానికి దారి చూపుతున్నారు వారు

4) అన్నింటికిమించి మానవత్వం విలువలకు తలవంపులు కలిగించే మార్గాలలో వారు సంపాదనకు కృషి చేయలేరు ఇవి రాక్‌ఫెల్లర్, ఫోర్డువంటి వారి వ్యక్తిగత జీవితాల్లో మనం గమనించే ఆశయాలు

## పురుషార్థాలలో 'ధనం' ఒకటి

ధర్మం, అర్థం, కామం, మోక్షం అనెవి నాలుగు మానవుడు సాధించి, పొందవలసిన ఆదర్శాలు, వాటికి పరస్పర పోషకత్వ (Complimentasy) పూర్వకమైన సంబంధం వున్నది, దానివి గుర్తించి వాటిని సాధించటంచేతనే మానవునికి విజయం చేకూరుతుంది

1) ఒక వ్యక్తి వున్నాడు అతనికి ఎన్నో పశువులు వున్నాయి వాటిని పోషించాలనే ఉద్దేశ్యంలో ఒక ఆడవికి తోలుకుపోయాడు కానీ అవన్నీ క్రూరమృగాలకు బలియై నశించిపోయాయి అదే రీతిగా ధర్మం అనేది ఒక కంచె వంటిది కోరికలు క్రూరమృగాల వంటివి ధర్మం అనే కంచె యొక్క రక్షణ లేకుండా, కోరికలనే క్రూరమృగాలను దరికి రానీయకుండా, ధనం అనే పశుసంపదను పెంపొందించవలెనని ఆశించటం అవివేకి యొక్క లక్షణం, అంటుంది మహా భారతం ఇది ధర్మానికీ, అర్థానికీ, కామానికీ (కోరికలకు) గల పరస్పర సంబంధం

2) సముద్రానికీ, వాన నీటికీ గల సంబంధమే ధర్మార్థాలకు వున్నది సముద్రపు నీరే ఆవిరియై, ఆవిరి మబ్బులై, మబ్బులు వర్షించగా సెలయేళ్లనదీప్రవాహాలూ పుట్టి, మరల అవన్నీ సముద్రంలోనే కలుస్తాయి అలాగే ధర్మం అనే సముద్రం నుంచి కృషి అనే మబ్బు పుడుతుంది కృషి యొక్క ఫలితమే సంపద మరల సంపదలన్నీ ధర్మమార్గంలో వ్యయింపబడి ధర్మ పోషణకై వినియోగం చెందాలి

3) ధన సంపాదన ఎందుకు ? కోరికలు తీర్చుకొనేటందుకు నిజమే ! కానీ ఈ కోరికలు ధర్మబద్ధమైనవిగా వుండాలి కానీ ఈనాటి మన కోరికలన్నీ ధర్మానికి విరుద్ధమైనవే కాబట్టి పతన హేతువులైన ఈ అధర్మపు

కోరికలను విడనాడటం మంచిది ధర్మబద్ధమైన కోరికల కొరకే ధన సంపాదన చేయాలి కానీ ఈనాడు ధర్మ బద్ధమైన కోరికలతో సంబంధం లేకుండా " Money for money's sake " " డబ్బుకోసం డబ్బు " సంపాదించటం జరుగుతోంది ధర్మాధర్మ విచక్షణ లేదు. " ఎందుకు నీకింత డబ్బు ? " అంటే సమాధానంలేదు అవసరాలకు మించిన డబ్బును కూడబెట్టడం చేతనే ఈనాడు ఆర్థిక నేరాలు అధికం అవుతున్నాయి.

" కాలికి సరిపడినంత చెప్పు వుండాలి చెప్పు పెద్దదైనా, చిన్నదైనా తంటాయే కదా ! అలాగే అవసరాలకు తగినంత డబ్బే వుండాలి లేకపోతే డబ్బుతోనూ తంటాలు తప్పవు " అంటారు భగవాన్ బాబా !

" డబ్బు వస్తుంది పోతుంది. కానీ శీల సంపద వస్తుంది పెరుగుతుంది " అంటారు బాబా ( Money comes and goes But morality comes and grows ) ఇవ్వాళ తమ పిల్లలకు కష్టపడకుండా ఆస్తులు సంపాదించి యిద్దాం. అనే దృష్టిగల కొందరు భాగ్యవంతుల యిండ్లలోనూ "నేనొక పెద్ద అధికారిని నా హోదా, నా వైభవం ఎవరికుంది ? అని గర్వించే కొందరు ఉన్నతాధికారుల యిండ్లలోనూ గల సంతానం ధనమదంతో వొళ్ళు మరచిపోయి సంఘానికి చీడ పురుగులవలె ప్రవర్తిస్తున్న కుల భ్రష్టులు, వంశ వినాశకులు అయి తిరుగుతున్నారు కనుక మానవతా విలువలు శీల సంపద అలవరచకుండా, కేవలం జేబుల్లో కరెన్సీ కట్టలతో పిల్లల్ని పెంచే తల్లిదండ్రులు తమ పొరపాటును, అజ్ఞానాన్ని గుర్తించి వర్తించాలి.

విపరీతంగా తమ వద్ద డబ్బు ఉన్నదని విశృంఖలంగా సమాజంలో ప్రవర్తించే ధోరణి ఈనాడు మానవత్వానికే అవమానకరంగా తయారవుతోంది డబ్బుతో మనుషులనే కాదు, దేవుణ్ణి కూడా కొనాలనే స్థితికి మనిషి దిగజారిపోతున్నాడు కనుక మనల్ని మనం రక్షించుకోవటానికి, " కులము కాదు గుణము, బలము కాదు శీలము, ధనము కాదు మానము, జాతి కాదు నీతి ప్రధానములు " అంటూ భగవాన్ బాబావారు ఒక మార్గం సూచిస్తున్నారు

ఎందరో మహానుభావులు సకల సంపదలూ కలిగి కూడా, తాము సాధారణమైన జీవితాలను నిరాడంబరంగా గడుపుతూ, తమ సంపదలను మానవసేవకు వినియోగిస్తూ బ్రతుకుతున్నారు ఈ జీవిత విధానాన్ని ఈ ఆర్థిక నీతిని ఒక పారమార్థిక సూత్రంగా వారు ప్రసాదిస్తున్నారు మనకి ఏమాత్రం లేకపోయినా వున్నవారివలె నటించటం, ఆడంబరాలకుపోయి అనర్థాలపాలు కావటం, సంసారాలు చితికిన తర్వాత "దేవుడా నీ మహిమ చూపించు" అంటూ ప్రార్థించటం మనకు ఎంతవరకు తగినదో గుర్తించటం లేదు ఇప్పటికయినా గుర్తించి అలా బ్రతికటం సుఖ సంసారాలకూ, ఆదర్శ కుటుంబాలకూ ఒక ముఖ్యావసరం

## కోరికలపై అదుపు

మనిషియొక్క ఆధ్యాత్మికమైన ఔన్నత్యం, అతడు తన కోరికలను తగ్గించుకోవటంలోనే వుంది " నేనేం చేసినా, ఆలోచించినా, మాట్లాడినా నాకోసం కాదు లోక కళ్యాణం కోసమే నా దంటూ ఏమీ ఆస్తి లేదు నా ఆస్తి అంతా విద్యార్థులే నేను ధరించే ఈ వస్త్రం కూడా నా విద్యార్థులు సమకూర్చినదే " అంటూ ఈనాడు భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు ఒక ఆదర్శాన్ని తాము అనుసరిస్తూ మన ముందు వుంచుతున్నారు

" బావిలోని నీరు తగ్గితే అడుగు భాగమునందున్న పదార్థములు గోచరమగును నీరు ఎక్కువైతే అవి కనబడవు అంతే ప్రకృతిలో దాగివున్న ఈశ్వర శక్తి గోచరింపవలెనన్న వాంఛలను తగ్గించుకొనవలెను. సేవాసంస్థలోని వారు వాంఛలను తగ్గించుకొని ఆచరణ పూర్వకమైన ప్రచారమునకు పూనుకొనవలెను " అంటారు భగవాన్ బాబా

కాలం బండిచక్రంలాగా తిరుగుతునే వుంటుంది. ఈ కాలప్రవాహంలో బండ్లు ఓడలూ, ఓడలు బండ్లూ

అవుతాయి ఆటువంటి కాలప్రవాహంలో కలిమిలేములు కావడి కుండలవలె అటు యిటూ మారుతూ వుండక తప్పదు అంతమాత్రాన మానవత్వానికి ఎన్నడూ ఏ ప్రమాదమూ రాకూడదు. మనిషిలో మానవత్వం విలువలు అణగారకుండా వున్నంతకాలమూ, సిరిసంపదలూ, పేరు ప్రతిష్ఠలూ తాత్కాలికంగా తొలగిపోయినా ఫర్వాలేదు చివరకు అవన్నీ అమరేవే అని నలచక్రవర్తి చరిత్ర నిరూపించింది

డబ్బు వుండటం సుఖం అనీ, డబ్బు లేకపోవటం కష్టం అనీ అనుకోవటం చేతనే మనం ధనానికి దాసులమై కష్టాలకు కలవరం చెందుతున్నాం చైనాలో ప్రతి రోజూ లేస్తూనే గుర్తుంచుకొనే సూక్తి ఒకటి వుంది "Difficulties are our friends Let us invite them" అంటారు వారు "కష్టాలు మన సోదరులు. వారిని ఆహ్వానిద్దాం" అంటారు వారు అదే మానవత్వం

మనం కూడా కొంతవరకు కష్టాలను ఆహ్వానించి భరించటం అలవరచుకొనకుండా, యితరులను సుఖపెట్టడం సాధ్యం కాదు నేను కష్టపడలేను, నా సుఖం చూసుకుంటూనే యితరుల సుఖం సంగతి చూస్తాను' అనుకోవటం మనం చేస్తున్న పెద్ద పొరపాటు మనం కష్టపడుతూ వున్నా కూడా యితరులకు చేతనైనంత సహాయం చేయటమే మనలోని మానవతకు నిదర్శనం!

"కృష్ణా! కష్టాలలోనే నీ కృపను పూర్తిగా అనుభవించగలిగాము కనుక మాకు సిరిసంపదలూ, సుఖసంతోషాలు వద్దు కష్టాలనే మాకు అనుగ్రహించవలసినదిగా నిన్ను ప్రార్థిస్తున్నాను ఎందుకో తెలుసా! ప్రతి క్షణం నీ కృపను అనుభవించటానికె!" అని ప్రార్థించిందట కుంతీదేవి కృష్ణపరమాత్మనితో

కాపురాల్లో లేమిచేత కష్టాలు వస్తూ పోతూవుంటాయి అవి మానవత్వంఅనే బంగారాన్ని మరింత ప్రకాశింపజేసే అనివార్యము, అత్యవసరమూ అయిన అగ్నిపరీక్షలు

( 8 వ పేజీ తరువాయి )

నేటికి గోచరమగుచుండును తిరుమల తిరుపతి దేవస్థానం వారు శ్రీ C అన్నారావుగారు కార్యనిర్వహణాధికారిగ ఉన్న కాలంలో వేసవిలో ప్రతి సంవత్సరం హిందూ ధర్మ శిక్షణ తరగతులను ఏర్పాటు చేసి ఒక నెలరోజులు ద్వైతాద్వైత విశిష్టాద్వైత సిద్ధాంతములను, మనుస్మృతి, పరాశరస్మృతి వంటి ధర్మ గ్రంథాల విషయములను, రామాయణ భారత భాగవతాది ఆర్ష గ్రంథాలలోని ధార్మిక నైతిక విషయాలను ప్రసిద్ధులైన విద్వాంసులచే ప్రబోధింపచేసి, చివరలో పరీక్షలు నిర్వహించి శిక్షణ పొందినవారికి యోగ్యతా పత్రాలు శ్రీ స్వామివారి చిత్రపటాలు, ప్రసాదము ఇస్తూవుండేవారు ఒక సంవత్సరం ప్రబోధకులుగా నన్నాహ్వానించి నెలరోజులు తిరుమలలో శ్రీ స్వామివారిని దర్శించే అవకాశమును కలిగించినపుడు శైవ, శాక్తేయ సంప్రదాయములకు సంబంధించిన అంశములనేకములను గుర్తించుట జరిగినది

'అలంకార ప్రియో విష్ణుః అభిషేక ప్రియశ్శివః' అనునట్లు అలంకారమునకు ముందు అభిషేకము సల్పుట చేతిలో డమరకము, నాగాభరణము, కాళ్ళకు అందెలు, నటరాజమూర్తియగు శివస్వరూపమును స్మరింపజేయును

బాలాజీ అని స్వామివారిని పిలుచుటయు దేవీ నవరాత్రులలో పరాశక్తిని పలు విధముల ఆరాధించునట్లు ఈ స్వామివారి నారాధిస్తూ పలు వాహనములపై ఊరేగించుటయు శక్తిస్వరూపమును స్ఫురింపచేయును నామరూపాలు భిన్నములుకాని యదార్థము పరిశీలించిన మూలతత్త్వమొక్కటియె "ఏకం సత్ విప్రాః బహుధా వదన్తి" అను ఉపనిషద్వాక్యము ఉన్నదొక్కటే పలువురు పలు విధాలుగా భావిస్తారని తెలుపుచున్నది

ఈ కథా మహిమతోపాటు ఆధ్యాత్మిక తత్త్వము కూడ మనము భావింపతగును మన దేహమే పర్వతము మన దేహములోని మూలాధార, స్వాధిష్ఠాన, మణి

పూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా, సహస్రారములనే ఏడు చక్రములే ఏడు కొండలు ఈ ఏడుకొండలపై నివసించు శక్తి రూపమే శేషుడుగానున్న కుండలినీశక్తి సర్వాకారముగ యీ శక్తి ఉండునని ఉపాసకుల అనుభవము, నిర్ణయము కూడ

శేషుడనగా మిగిలినవాడని, సర్పరాజని, మహాశక్తియని అర్థము ప్రపంచమంతా ప్రళయకాలంలో విలీనం కాగా మిగిలిన రూపమే " శేష " సంజ్ఞతో వ్యవహరింపబడును మన దేహము నశించినను శేషశక్తి నశింపదు

ప్రపంచమంతటిలో యింతటి జనాకర్షణ కలిగి భక్తుల కోరికలను తీర్చు దైవము వేంకటేశ్వరుడే యనుట అతిశయోక్తి కాదు ' వేంకటేశ సమోదేవః నాస్తి బ్రహ్మాండమండలె ' అను ఆర్షసూక్తి అక్షర సత్యమని చూచినవారికి సేవించినవారికి తెలియగలదు ఈ విధముగ శివ, విష్ణు శక్తి రూపాలతోనున్న తిరుమల శ్రీనివాసుని అన్ని మతాలవారు తమ తమ అభీష్ట దైవముగ భావించుటొక ప్రత్యేకత కేవలం విష్ణుదైవములకు జనార్దనస్వామి, మాధవస్వామి, కేశవస్వామి, గోవిందరాజస్వామి వంటి పేర్లు మాత్రమే యుండును తిరుమలలోని దైవానికి వేంకట + ఈశ్వర వేంకటేశ్వర నామము ' ఈశ్వర ' పదముతో కలసి వ్యవహరింపబడుట విశిష్టలక్షణముగా భావింతురు

ఈ స్వామికి నిత్యము తెల్లవారుఝామున 3-00 గంటలకు సుప్రభాతసేవతో ఆరంభమైన సేవాకార్యక్రమము రాత్రి ఏకాంతసేవతో ముగుస్తుంది సుప్రభాత సేవ కాగానే విశ్వరూపం భక్తులకు లభిస్తుంది ఆ సమయంలో బ్రహ్మపూజా, తీర్థం భక్తులకందిస్తారు నిత్యము రాత్రివేళ ఏకాంతసేవ జరుగునపుడు బ్రహ్మ, ఇతర దేవతలు పూజాదికములు నిర్వర్తిస్తారు ఆ పూజా తీర్థమే సుప్రభాత సమాప్తిలో భక్తులకందచేస్తారు

ఈ బ్రహ్మోత్సవాలు 9 రోజులు ముఖ్యములే అయినను 5 వ రోజు అతి ముఖ్యమైన పర్వదినంగా భావించి లక్షలాది భక్తులు దర్శించి సేవిస్తారు ఈనాడు స్వామి మోహినీ అవతార రూపంలో దర్శనమిస్తారు ఆనాటి రాత్రి గరుడవాహనముపై ఊరేగు స్వామి దివ్య మంగళ సుందర రూపము చూడవలసినదే గాని చెప్పనలవికాదు "గరుడస్థం మహా విష్ణుం దృష్ట్వా మోక్షమవాప్నుయాత్" అను వరాహ పురాణ వచనాను సారము దేశ విదేశాల నుండి భిన్న భిన్న మతాల వారందరు స్వామిని దర్శించి ధన్యులైనట్లు సంతృప్తి చెందుదురు అందుకే కలియుగ వైకుంఠముగా భారతావనిలో ప్రసిద్ధినొందెను

ఆదిశంకరులు ప్రతిష్ఠించిన ఆకర్షణ యంత్ర ప్రభావముచే నిత్యము వచ్చు కోట్లాది జనమునకు, ధనమునకు వివిధ సేవాకార్యక్రమాలు, ఆధ్యాత్మిక ప్రచారాలు, భుక్తి ముక్తిదాయకములై శారీరక మానసిక శాంతి సౌఖ్యములకు మూలకందమగుట మన అదృష్టము

భక్తలోక శరణ్యాయ కలికల్మషహారిణే
శేషాచలనివాసాయ వేంకటేశాయతే నమః *

## విదుర నీతి

" అసంత్యాగాత్ పాపకృతామ పాపాం
స్తుల్యోదండః స్పృశతే మిశ్రభావాత్
శుష్కేణార్ద్రం దహ్యతే మిశ్ర భావాత్
తస్మాత్ పాపైః సహ సంధిం న కుర్యాత్ "

పాపముచేయు వారి సాంగత్యము వీడకుండుట వలన పాపము చేయని వారు కూడా శిక్షను అనుభవింతురు ఎండు కట్టెలతో కలిసియున్న తడికట్టెలు కూడా కాలిపోవుచున్నవిగదా ! అందువలన పాపులతో సహవాసము చేయరాదు